# మృగేంద్రవాహన

★


గ్రంథకర్త

ఉభయభాషాప్రవీణ, విద్వాన్

మున్నెకంటి గురునాథశర్మ

ఆంధ్రోపాధ్యాయులు, హిందూకాలేజి హైస్కూలు, గుంటూరు


★


అజంతా బుక్ హౌస్

వరంగల్లు

కాపిరైట్ | 1950 | వెల : రు. 1–0–0

శ్రీరస్తు

# మృగేంద్రవాహన

శ్రీకృష్ణా! గోవిందా!
లోకేశ్వర! వేణుగాన లోలా! విశ్వా
సీకోదర సుహారా! స
త్యాకాముక! నన్నుఁగావు మంజలి యిడుదున్.

శ్రీకృష్ణునకు నైసర్గికమును బోలు ద్వారకాపురమున ద్వాపరమునఁ గాంచీపుర ముండెను. అందు వైదికాచారపరులుగాని బ్రాహ్మణులును, శౌర్యధైర్యసాహసమాదులు చూపని క్షత్రియులును, గోరికిఁ బడగలెత్తని వైశ్యులును పెద్దల యాచారము ననుసరింపని శూద్రులును లేరు. అందలి యష్టాదశవర్ణముల వారును వర్ణాశ్రమధర్మముల శ్రద్ధమెయి నాచరింతురు.

ఆ పట్టణమున వేశ్యాజాతికి నొక బాలిక బాల్యమును విడిచి క్రొత్తగా యౌవనమునఁ బ్రవేశించినది. ఆమె చక్కనిచుక్క. అందాలబరిణె. ఆటపాటలు నేర్చిన జాణ. ఆమె మొగము ముద్దు గారుచుండును. పలుకులు తేనె లూరుచుండును. ఆ బంగరు బొమ్మ పేరు కలభాషిణి.

ఒకనాఁడు కలభాషిణి తన తోడియువు చెలియలతోఁ గూడి పురోపవనమున కేగి పెక్కు తెఱంగుల సరససల్లాపము లాడు

కోసుచు వనవిలాసము లాలోకించుచు విహరింపఁజొచ్చెను. ఆ కాంతామణులు కొప్పులూరలఁ బైఁటలుజాఱ నడుగులు తడఁబడ నందెలు మ్రోఁగఁ గంకణంబులు ఘల్లురనఁ దారహారములు చిక్కువడ నొండొరులు మీఱి జాజులు గులాబులు మల్లెలు మొల్లలుఁ జేమంతులు మున్నగు పువ్వులం గోసికొని వీఁగుఁ గ్రొమ్ముడులం జెరివికొని యున్నత నారింగ వృక్షశాఖల నుండి వ్రేలాడు బట్టువైన తీఁగయుయ్యాలల నూఁగుచుం జక్కులం దాఁకి వచ్చెదమని పంతాలాడుచు భీగపుల గలిసి యూఁచు నవ్వుచుఁ బ్రేలుచు నుండిరి.

అట్టియెడ నాకాశమార్గంబున శ్రీకృష్ణ సేవార్థము నేగెడి మహామునీంద్రుం డరుగుచుండెను. అనుయాత్రికుఁడై మణికంధరుండను గంధర్వ కుమారుండు నా గానవిద్యా రహస్యంబులను నేర్చుకొనుటకై శిష్యత్వంబుఁ గోరి వచ్చి యుండెను. అయ్యిద్దఱుం బుడమినున్న యారామద్రుమవృక్షల గస్తూరికామోదంబుం జూచి యబ్బురంపడిరి. అపుడు మణికంధరుండు దివ్యమునీంద్రునితో "స్వామీ! చిత్తగించితిరా? యీవనకుసుమములు నెలఁతలం జేతలు. ఊపు పైకివచ్చినపుడు చాఁగియున్న నాపాదములు తీవి దేవతాకాంతల మీఁదఁ గయ్యాలకుఁగా లోఁగి లోఁగుచు నుండెం జుమీ" యనిన నారదుండు "బళి! బళి! నీ వుప్రేక్ష నందులకు నలంకార యుక్తముగా భావించి భాషించితివి. మణికంధరా! నీ వన్నయట్లే యుల్ప్రాయము నుప్రేక్షింప యుండవలె యున్నది. కాని యుయ్యాల లూఁగునప్పుడు మింటి దెసకేగు వారి చరణంబులు కయ్యాలకుఁ గాలు ద్రవ్వుచున్నట్లు

చిన నిలువవచ్చుంగాని లేనిచో మానవాంగనల సోయగమ్ముల కితఁడు భ్రమపడక యుండునా?" యని యెక్కసక్కెంబుగాఁ దనమదింగల యీర్ష్యను వెల్లడింప జడదారి నిలువంబడి "యిదియేమి? నీమాటల యర్థమును స్పష్టముగా నాకువివరించిచెప్పు" మనరంభ "దేవరకుం బ్రస్తుతగమన నిరోధంబుగాకుండ విమానంబు మీఁదికి విచ్చేయుఁ డన్నియు వివరించుచు నరుగుదెంచెదను. మహానుభావులంగొంత మేరయైనం గొలిచి వచ్చుట మహాభాగ్యంబుగాదె?" యనుచు శిష్యసమేతంబుగా మునిం దమ విమానంబుపై నునిచికొని తా నొకవైపున నలకూబరుం డొకవైపున నిలిచి చామరంబుల నల్లనల్లన వీచుచు "స్వామీ! డోలావిహారిణులం గూర్చి శిష్యులోఁ దమ రేమని పల్కితి రానతీయవలయు.

నార : బళి! బళీ! సత్కవివై సందులకు నలంకారయు క్రమముగా భావించి భాషించితివి. మణికంధరా! నీవన్న యట్లీయెల ప్రాయపు ముద్దుగుమ్మలయంద మట్లయున్నది. కాన నుయ్యాల లూఁగునప్పుడు మింటిదెసకేగు వారి చరణాంబులు కయ్యాలకుఁ గాలుద్రవ్వుచున్నట్లుగాక సురకాంతల యాందలలందన్నఁ జనునట్లున్ననినం దప్పులేదని పలికితి. ఇం దేమితప్పు గలదు? రంభా! నీ మదిలోనిమాటను దాఁపకుము.

రంభ : మీరు పెద్దలు. లోకపూజ్యులరు. ఏమన్న ననఁగలరు. ఎవరు కాదనఁగలరు? కాని స్వామీ! మేము లోకోత్తర

సౌందర్యవతులమనుట కీ జగన్మోహనమూర్తియైన యర్థ పతినందనుఁడు సాక్షిగాఁడె ?

నార : (నవ్వుచు) ప్రియుఁడు నీయందిట్టి నిబ్బరమైన ప్రేమ నిలిపి నీవశమాయెడు నంతచే నీవిట్లు నాడఁదొడఁగుచున్నావు. ఐనను రంభా ! అన్నిదినములు నిట్టే సాఁగునా ? ఒకవేళ నీవు మాత్రమే సవతి కలుగఁగూడదా ? భావికాలస్థితి నెవ్వరికి వశమే ? ఎన్నివింతలు జరుగరాదు. నిన్నుఁబోలువనిత నీకును, నిన్నుఁబోలినపురుషుఁడు నీనికిని గలిగి కలంతపెట్టినను బెట్టవచ్చును. ఎవ్వరికిని గర్వము తగదు.

రంభ : (సంభ్రమముతో) స్వామీ ! నమస్కారములు. మీరు నవ్వులకనినను నామాటలు బొంకు గావు. నన్ను క్షమించి యింక నేమియుఁ బలుకను. దయఁజూడుఁడు.

అనుచుండ విమానము ద్వారకచెంత కరుదెంచె. అపుడు నారదు నాజ్ఞానుసార మవ్విమానము కలభాషిణి విహరించు చున్న యెలదోఁటలోనికిం దిగియె. అచట విమానము నుండి శిష్యసహితుఁడై నారదుండు దిగుచుండఁ దామును దిగి వినయ పూర్వకంబుగా నమ్మహర్షి వలన ననుజ్ఞ నడసి, రంభా నలకూ బరు లటకుం గన్పించుచున్న శ్రీకృష్ణప్రాసాద రాజంబునకు రెండుచేతులెత్తి మ్రొక్కి యవ్వలఁ దమ విమానం బెక్కి నిజేచ్ఛం జనిరి.

కలభాషిణియు నట మున్న తన కనతి దూరంబున వినంబడు వారి సంభాషణంబుల నాలించియుఁ, బిమ్మట ధగధగిత దిగంతరంబగుచుఁ జేరవచ్చు విమానంబు నిరీక్షించియు నలకూబరుని రూపలావణ్య సౌభాగ్యంబులం గని యచ్చెరుపడి తల యూఁచి మెచ్చుకొనుచు నిర్నిమేషదృష్టిం దిలకించుచు నిలువఁబడె. ఆవల విమానం బేఁగునపుడును దదాలోకనంబునం దనివి సనక కొంతదూరమట్టె చూచుచుఁ దద్విమానంబు క్రిందటి క్రేవంబూఁబొదరిండ్ల మఱుఁగున గ్రుత్తగతింజనుచుండె. కను వేఁదు తెంత చెడ్డది! అంత విమానంబు మిక్కిలి దూరంబుగా నేగుటయుం గలభాషిణి నైరాశ్యంబునం దిగివచ్చుచుఁ దనలో నిట్లు తలపోయసాఁగె

నారదకలభాషిణుల సంభాషణము

"అరరే! ఎంత చక్కఁదనము! ఎంత చక్కఁదనము! మనఃకల్పిత సౌందర్యఖనుల చిత్రపటములందును నిట్టివానిం గాననైతిని. మాప్రభువుల వారికంటె యువరాజులకంటెను గూడఁ బై చేయిగాఁ గన్పించుచున్నాఁడు. అరయనరయ పితృండుమనుష్యుండుగాఁడనవచ్చును. దేవతలలోను నింద్రునికుమారుఁడో? కుబేరుని కుమారుఁడో యై యుండవచ్చు. ఆఁ మఱచితి. మఱచితి. ఆవిమానంబునందలి నాతి తనపిత్రియుం దర్థపతి నందనుండనియె. కనుకనితండు నలకూబరుండ. సందియంబు లేదు. నలకూబరుండెప్పుడు రంభతోఁ గలిసి విహరించుచుండుననియు విందును. ఆ సుందరి రంభయైయుండును. రంభా! నీవెంత యదృష్టవతివే! అట్టి జగదేకసుందరుని ముక్కుపట్టుకొని యాడించుచున్న

దానవు. భళీ ! నీ యాడుపుట్టువు సఫలమైనది. అని తలపో
యుచు వచ్చుచు విమానంబు దిగివచ్చువాని మాని నెదురు
గాఁగని యీ మహాత్ముండు నారదమునీంద్రుండు. శ్రీకృష్ణుల
వారి దగ్గఱకుఁ దఱచుగా వచ్చుచుండును. వీరినడిగి నాసంది
యంబుఁ బాసెద. మహాత్ముల దర్శనంబు రిత్తవోవదండ్రు."
అని తానొక్కతయే యాసంయమీంద్రుఁ డాసి వినయమునఁ
బ్రణమిల్లి లేచి చేతులు జోడించి

కల : స్వామీ ! యిపుడు విమానమున నేగినవారు రంభానల
కూబరులు గదా ?

నార: ఔను. వారి నీవెట్లెఱింగితివి ?

కల : మీరాడుకొనుమాటలంబట్టియట్లూహించితిని స్వామీ!

నార: ఆకాశంబున నాడుకొన్న మా మాటల వింటివా ?

కల : చిత్తము. ఆ కామినీమణి గర్వోక్తులను, వాని సహిం
పని తమ సుభాషితములను వింటిని.

నార: కాదటే ! తన్ను మిన్నుగానక పలుకు గర్వోక్తుల
నెవరు సహింతురు ? ఎవ్వరైనను మేమింతవారమను
కొనందగునే ? యువతీ ! ఆరంభ గర్వం బడంగుటకిదే
సవతికయ్యము రాఁబోవుచున్నది.

కల : దివ్యదృష్టిగల తమ కెఱుకపడని విషయము లుండునా ?
సవతియు నెవ్వతెయో యెచ్చటనో యేర్పడియుండును.

నా : ఎచ్చటనో యేర్పడి యుండనేల ? దైవనియుక్తి కొంత
యున్నచో సవతివి నీవు కానేరవె !

కల : (నవ్వుచు మోముపంచి) దేవా! అంతటిరూపరేఖావిలా
సము లున్న బోటికింగాక దైవనియుక్తియు నాబోంట్ల
కెన్నిపాట్లుపడిన నెట్లు లభించును?

నార : అట్లనెదవేమి? రూపరేఖావిలాసాదులలో నీవచ్చరల
మింతువుగాని యెందుం దీసిపోవుసుమీ.

కల : దేవరవారి యనుగ్రహమున్న (అని చేతులు జోడించును)

నా : సరియేకాని, నిన్నెచ్చటనో చూచినట్లున్నది? శ్రీకృష్ణుని
కొలువునను వత్తువా యేమి?

కల : చిత్తము. స్వామీ! మీ సందర్శనభాగ్య మచట నాకు
సిద్ధించుచుండును.

నార : సరి. సరి. జ్ఞప్తికి వచ్చినది. మాశిష్యుండు మణికంధ
రుండు క్రొత్తగా హరిం జూడవచ్చి దండకమును స్తవము
చేయ నేకసంథగ్రహించి పఠించిన నేర్పరివిగదా నీవు.
పేరు కలభాషిణిగదే. మేలు. మేలు. ఆదండక మిప్పుడును
జదువ శక్యమగునా?

కల : కాకేమిస్వామీ! శ్రీకృష్ణభగవానుఁడే దండకమును విని
మెచ్చుకొని మణిహారమును తమశిష్యునికి బహుమతిగా
నొసఁగెనో దానిని మఱతునా. వినుఁడు స్వామీ! (అని
మణికంధరునివికసితనేత్రయై తిలకించి నమస్కరించి శ్రీకా
మినీ కామితాకార......అని చదువ మొదలిడఁగా)

నార : ఆగుమాగుము. నీయం దెంత ధారణాశక్తి గలదే! రంభ
కీనైపుణ్య మున్నదే? కనుక నే నాకట్లు మాటవచ్చినది.

కల : స్వామీ! మిమ్మువంటి మహాత్ముల సన్నిధినున్న నేది యసాధ్యము? ఒకమాట. నేను బాలకాలమునుండి తమ వీణామోసి సేవ సేయఁగోరుచుంటిని. దేవరవారు (శ్రీకృష్ణులు) వారి యంతిపురిలోని కరుగుచుండ దవంగణమున మీ యీ శిష్యుని నిలిపి వారిచేతి మీవీణెను మీరుపుచ్చుకొని యేగుచుండ నప్పుడవచ్చి దానిని నేఁబూని తేఁదలంతును. కాని తమ రేమనుకొందురో? తమ యానతి లేని పని చేయుటెట్లని జంకుదును. స్వామీ! యిప్పుడు కరుణతో నాకంతమాత్రపు టూడిగమునకు మొదలవెట్టుఁడు. ధన్యనగుదును.

నారద : సరియే కానిమ్మా.

అనుచుండఁగలభాషిణి సఖ్యలుగు చేరవచ్చిరి. అంతట మాని యమ్మగుడతో 'వేగంబ నిజగృహంబున కరిగి కొలువు సింగారంబు సంఘటించుకొనిరమ్మ' నిపంపి తా శిష్యునితో నడచుచుఁ బుర ప్రవేశమార్గంబుం బట్టెను.

## ౨. మజిలీ

నారదుఁడు శ్రీకృష్ణ మందిరమున కరుగుట

నారదమహర్షి సశిష్యుండై రాజమార్గంబున వచ్చుచుండడం గనుంగొని కొందఱచిదియేమి? దూరమారమునుండి యాకాశము నుండి నేల కేల దిగెనో! యనియుఁ, గొందఱు కయ్యములు పెట్టుటకు గతి వెదకుటనో! యనియుఁ, గొందఱు తమ పాదధూళిం బరగించి యిందఱఁ గృతార్థులం జేయఁ దలంచెనో? యనియుఁ, గొంద

తేఁబాటగల భూదేవి యెట్టి పుణ్య మ్మొనర్చికొనెనో? యనియు నిట్లనేక విధంబుల జనంబులు తలంపసాఁగిరి.

ఋషితిలకు నెఱిఁగిన కొందఱతిదూరమునన లేచి రెండు చేతులు జోడించి నిలువంబడిరి. సమీపమునం దున్నవారు నేలఁ జాఁగిపడిరి. వాహనాదులం దున్నవారు ససంభ్రమములై దిగి వచ్చి మ్రొక్కి వెంటవచ్చెడి జనులమూఁకను బరాబరిసేయుచుఁ గొల్చి వచ్చుచుండిరి.

అయ్యవసరంబున నత్తపసి కొందఱపైఁ గటాక్షంబులం బఱపియుఁ గొందఱపైఁ బూర్ణదృష్టి నెఱపియుఁ, గొందఱపైఁ జిఱునవ్వుఁజిలికియుఁ, గొందఱపై దీవనను విసరియుఁ, గొందఱఁ జేయిసాఁచి లెమ్మనియుఁ, గొందఱఁ గ్రొత్తదండ మాదరించియు, నంబుజాక్షుని కొలువుకూటంబు డాసి 'యిది వైకుంఠమువలె నాకమితానందము గల్గించుచున్నది. నిచ్చలుచూచుచున్నను దనివి సనద'ని మణికంధరునితో ముచ్చటించుచు నడచుచుండె. అది గని ద్వారపాలికలు పరుగుపరుగున లోనికరిగి మహర్షి రాక ప్రభువున కెఱిఁగించిరి.

ఆమాట చెవింబడెనో? లేదో? వెంటనే శ్రీకృష్ణుఁడు దంతపు టుయ్యాలమంచమునుండి దిగ్గునలేచి "ఎట్టెట్టూ! పరమేష్ఠినందనుఁడె? త్రోవనడచుచు వచ్చుచుండెనే! ఇది చాల చిత్రముగ నున్నదనుచుఁ దొయ్యలి మడచి యిచ్చిన తమలపాకుఁజిలక చేతియందయుండ, గబగబ దొడుగుకొనుటలోఁ దార్మారైన రతి

శ్రీకృష్ణుఁడు నారదుని పూజించుట

నపుఁ బావాలు సారెసు జాఱుచుండఁ, దనకుఁ గైదండ యొసఁగిన తరుణి కేలు వదలనేఱుఁగమి నదిలోనె వచ్చుచుండఁ జూచినవా రెల్లరు వెనువెనుక కొందుగుచుండ, బిరబిర వాకిటి హజారమునకు వచ్చి మునీంద్రునకుఁ బ్రణమిల్లి హస్తావలంబన మొసంగి లోనికిఁ దోడ్కొని పోయి యర్ఘ్యపాద్యాదులం బూజించె. పూజ్యులు పల్మరు వచ్చుచున్నను ధర్మాత్ముల బుద్ధులం దాదర మెచ్చుచునేయుండును.

అప్పుడు సభాగతుల సందడి నాలించి నారదుండిది యేమయ్యా? నీకై మంత్రిప్రముఖులు వచ్చి వేచియుండ సభ కేగక నాతోనే యుంటివి. నేనున్న నీకు రాజ్య మక్కఱలేదా? యేమి! అట్లయిన నేఁబోయెద. కాదేని సభదీర్చి రాచపనులు దీర్చికొనుము. అన శ్రీకృష్ణుండు తమ్మునితోఁ గొలువుకూటం బుం జొచ్చి యించుక తడవు సముచితకార్యంబులు నడపి యవ్వలఁ గొలువు చాలించి మునీంద్రు నంతఃపురమునకుఁ దోడ్కొని చనియె.

*కలభాషిణిపై శ్రీకృష్ణు ననుగ్రహము ప్రసరించుట*

అచట మణికంధరుని వెలుపలన నిలిపి నాఁడు తెచ్చుచున్న వీణను నారదుం డందుకొనుచుండఁ జక్కఁ దెగ్గఱి లాగుసం గలభాషిణి యాస్తికముగా నచటఁ బాదగట్టి నమస్కరించి వినయవినమితోత్తమాంగయై నారదు చేతి వీణియం బుచ్చుకొనియె.

అది శ్రీకృష్ణుండు సూచి నగవు దేలు చూపులతో "నేమీ మునివర్యునకు శిష్యత్వంబున సేవఁజేయ నిచ్చు పాడవునా ?" యన నదియేమిలేదు. స్వామీ ! యని వినయ భయభక్తులతో నిటునటునొదిఁగెను. దానింగని కృష్ణుండిట్లనె. "పిల్లా! భయమేల? నీకిది కడు లెస్సబుద్ధి. ఇట్టి మహాత్ముల సేవ లభించుట మిక్కిలి దుష్కరము సుమీ. అట్టిది నీకశ్రమంబున లభించినది. బ్రదికితివిపో. సేవించి శోభనములందుము. నీబుద్ధియు నీపాటకొను నేర్పులు నీ గాత్రమాధుర్యము చూచి నారదులవారి సేవ సేసిన నిది పనికివచ్చు పిల్లయగునుగదా యని నిన్నుఁ గనుఁగొన్న వేళలఁ దలంచుచుందును." అని పలుకుచు నారితో నల్లన జాంబవతి గృహంబునకేగి యామెతో "వింటివా? శిష్యురాలి నొకతెం దోడితెచ్చితి. దీనిం గైకొని శిక్షింపుము" అని మందహాస భాసురాననుండై పలికెను.

అపుడు జాంబవతియు సితదంత కాంతి వెలుగుచుక 'నాకు మును మీరు చెప్పెడి కలభాషిణియా యిది!' యనుచు దాని నాదరంబునఁజూచి యమివర్యునకు యథోచితోపచార విధులొనరించె.

అంతఁ గృష్ణుఁడు కలికీ! యీనారదమౌని తెలియుఁడు చాల నాళ్ళనుండి వచ్చుచున్నాఁడు. ఏమేమి దిద్దితివి? ఇతఁడుగాన చాతురిం బ్రోడ యయ్యె నదిచాలక తుంబురునిపై మత్సరంబున మన విద్యసాధింతుమని పూనియున్నాఁడు. నీనేర్చినగాన విశేషంబు

నారదాదుల గానాభ్యాసము

లన్నియు నెఱింగింప నీకొప్పగించితి. ఇతఁడెంతవఱకు వచ్చెనన మీయాజ్ఞ జవనాటక ప్రవర్తించుచున్నదాన. నాతప్పొప్పులఁ దాఘురయుఁ డనుచుఁ దాఁగొంతసేపు పాడి నారదునిచేతను గూడఁ గొంతసేపు పాడించెను.

అదివిని వేణుగానలోలుఁడు మేలు మేలు : కొదవలేదు. సాహిత్యోచ్చారణమున గురులఘువులఁ బాటించి పదంబుల విఱుపు లెఱింగి భావముం బ్రస్ఫుటముగాఁ బ్రకటించుచు నీ పుణ్యాత్ముఁ దిద్దుమని చెప్పి చనియె. ప్రభునాజ్ఞ ప్రకారము నారదుఁడామె చెంతను బిమ్మట సత్యభామ దగ్గఱను బిదప రుక్మిణీదేవి చెంగటను నొక్కొక్క వత్సరముగా గానవిశేషముల నభ్యసించి తుదకుఁ గృష్ణునికడ నొకవత్సరము నేర్చికొని యారితేరిరి. అట్లు కలభాషిణియు నేర్చికొనియె. మణికంధరుం డంతఃపురాంగనల శిక్షచేనుండియుఁ బుండరీకాక్షుని యనుగ్రహ విశేషంబున సకల సంగీత కళారహస్యంబుల నారద కలభాషిణుల యట్ల యత్యధికుండయ్యె.

ఇట్లు నారద మణికంధర కలభాషిణుల గానవిద్యాంసులఁ జేసి హరి మీఁద గీతమ్మునకు మజ్జగంబుల నీడు లేదని పలికి, నారదునితో నింక గానకళలో మీరు నేర్వవలసినది లేదని యమితానందాబ్ధి నోలలాడించెను. కృష్ణు నంతఃపురాంగనలును నారదుం గడు మెచ్చుకొని మిమ్ము మించిన చేయి లేదనిరి.

అట్లు విద్యాగురువు లందఱుఁ బలికినను నారదముని మదికి నారదుఁడు కలభాషిణికిఁ నింకను సందియంబె. విద్యావంతులకుఁ గానరూప మిచ్చుట 'పోటీపరీక్ష'ల యందు గెల్చినంగాని విశ్వాసము కుదురదు.

ఒకనాఁడు నారద కలభాషిణీ మణికంధరులు కృష్ణుని వీడ్కొని చనునెడ నంతఃపురాంగనలు మానిని ప్రశంసించిన ప్రసంగము రాఁగా నారదమౌని యిట్లనియె. "ఔను. వారు మువ్వు రట్లు నన్ను గానవిద్యలో నగ్గించుట తమ తమ హృదయంబులం గల నిజవిధంబో! లేక నాదుమదికి ముదంబు బొదవించుకొనుటకునో! తెలియంగరాదు. నేర్పరు లెప్పుడు నెదిరిమదికిం బ్రియంబుగలుగనే మాటలాడుదురు. అందును సమక్షంబున లోటుపాటులం జెప్ప శంకింతురుగూడ. కనుక నా సమక్షంబున జరిగిన ప్రశంసను నమ్మ నామనంబొప్పకున్నయది. కృష్ణుఁడు తమ దేవేరులతోడను వారు తమ చెలులతోడను నా పరోక్షంబున సలిపిన ప్రసంగంబె యథార్థమైనది. అట్టియెడ మొగమోటము బాధింపదు. కలరూపు వచింతురు. కనుక నవనీతచోరుని దేవేరుల యాంతర్య మెఱుంగువఱకు నా హృదింగల సందియంబు తొలంగదు.

అనుడుఁ గలభాషిణి యిట్లనియె. స్వామీ! నే నాఁడుదాన నగుట నంతిపురి కేగఁగలను. రాణులతోఁ బరిచయభాగ్యము న్నది గాన నందు స్వేచ్ఛగా విహరింపఁగలను. అపుడు రాణులు తమ సఖులతో నిష్టగోష్ఠి నాడుకొను మాటలు విననువచ్చు.

వంక యెక్కడిది స్వామీ! అని నుడివి మౌనివర్యు సంతుష్టాంతరంగుం జేసె.

అంతట సంయమీంద్రుం డా యువతిం జూచి నవ్వుచుఁ "గలభాషిణీ! నీవును గరిపిముచ్చుఁ దనంబున గానకళం గంటివి. నీ కెందును లోటులేదు. నా యభిలాషయుం దీర్చితివి గాన నీ యభిలాషయుం దీర్చెదను. కొమ్మా! మున్ను నీ వాత్మలోఁ గోరుకొన్న కాంతుఁడు రంభామనోహరాకారుండగుచు నెలమిని వానిని గూడఁగలవు. నిజగృహంబున కరుగు" మని యామెం బంపి యది తొలుత మణికంధరుని యౌవనము, పాండిత్యము, కవిత్వము, మున్నగు గుణములం జూచి వీని వరించినది. ఆవల సౌందర్యరాశియగు నలకూబరు నాకృతిం జూచి వానిం గామించినది. కామిను లెప్పుడును సౌందర్యమునకే యాకాంక్షింతురు. నేను దానిమది చిన్నవోకుండ నట్లుచితముగా దీవించి పంపితిని అని భావించి మణికంధరునితోఁ గొంతతడవు సముచిత సంభాషణంబులఁ గడపి తీర్థయాత్రల కేగుమని మణికంధరుం బంపి నారదుండు తాను యథేచ్ఛం జనియె.

## 3. మజిలీ

మణిస్తంభుఁడు కలభాషిణికడకు వచ్చుట

కలభాషిణి నారదమహాశిరోమణి యాశీర్వచనము శిరముతో నందుకొని తొలుత గలిగిన మణికంధరునిపై వలపు మాని నలకూబరునిపైఁ జిరకాలము గడపుచుండెను. జవరాండ్ర చిత్తములు క్షణక్షణికములు.

ఇదివఱకు గానాభ్యాస మొనర్చుటకును రాచనగరికి రాకపోకలు సేయుటకును దానికిఁ గాలము సరిపోయెడిది. దీనికిఁ దోడు పెద్దల భయమును దోడ్పడ నానాలుగేండ్లీతలంపునకే యవకాశము లేకుండెను. ఇప్పు డట్టిది లేమింజేసి నిచ్చలు నలకూబరుఁ దలంచుకొనుట కవకాశముంటచే వేశ్యకు విరాళి హెచ్చసాఁగినది. పనిపాటలు లేనివారిస్థితి యిట్టిదే.

ఎంతయుఁ దాను మానుషి. వాఁడు నిర్జరుఁడు. తాను భూమియం దుండును. వాఁడు దేవలోకమం దుండును. తన కాకాశగమనశక్తి లేదు. వానికి దీనిపై వలపు లేదు. ఇట్టి స్థితిలోఁ గుబేరనందనుం గవయఁ దా నెట్లూహించుచున్నదో? కేవలము నారదుమాటంబట్టియే? ప్రేమ గ్రుడ్డిది యనుట యిందువలననే కాఁబోలు.

దినములు పక్షములు మాసములు వత్సరములును గడచినది. కాని కలభాషిణికి యక్షనందనుం బొందుచందము పొడకట్టలేదు. కామరూపమున్న నేమి? కామగమనము లేదాయె. దూతిక లున్న నేమి? రాకపోకల కనువు లేదాయె. అట్లని వలపు మరలదాయె. మీఁదుమిక్కిలి పెచ్చుపెరుగసాఁగె. అందువలన నేమియుఁ దోఁపక యొకనాఁడు కలభాషిణి తానొకర్తుకయు, చేకానవలె వీణెయుఁ గైకొని గృహారామమున కరిగె.

కొంతతడవునకు గగనమునుండి యొక సిద్ధపుంగవుఁడు సింగపు వాహనముతో వచ్చి వారకాంతచెంత వ్రాలెను. ఆ యొడలి బూదిపూఁత, నా యోగదండము, నా కక్షయందలి

గంత, నా పొన్నువేసిన చిన్న ప్రేంపబెత్తము, నా ముడివడిన కెంపుజడల, నా గంజాయిగొట్టము, నా యూదుకొను శృంగము, నా పాడుకొను కిన్నెరం జూచి కలభాషిణి యాశ్చర్యపడి, సింగముంగని బెంగపడి యంతలో ధృతిపూని వసివడి దరికేగి యర్ఘ్యపాద్యాదు లొసంగె. అప్పుడా సిద్ధనరుం డిట్లనియె. "కలభాషిణీ! ఆత్మగురుండగు శ్రీకృష్ణుం గొలువ నేగుచుంటివా? సంగీతవిద్య సాంతము నేర్చితివా? నారదుని రాకపోకలడంగెను గాబోలు. అందువలన నీ కితరచింతలు లేవు నలకూబరుపై వలపంత పెరుగుచున్నదటే? కడపటినాడు నారదుండిచ్చిన దీవెన వ్యర్థమగునా? నైరాశ్య ముజ్జగింపుము. అమ్మా! మణికంధరుండు తపమునకొగ్గి పాట మానివేయుటచే నా చెవులు త్రుప్పుపట్టెనవి. ఆత్రుప్పుడుల్ల నేడీ! యొక్క రాగము వీణెమీద నాలాపింపుము. మీ యిర్వుర గానమే నాకుం గర్ణరసాయనము. తదితరములు గావు. ఇరుగు పొరుగువారు మూగుచుండిరనియా? కొంతకాలమునుండి మేడపై కెక్కి పాడుట మానితివి? చాలకాలమునకుం దోటజూడవచ్చితివి సుమా. ఎన్నడు నొంటరిగా రావు. నేడేల యీపని చేసితివి. అనుచుండ మాటమాటకవ్వొంది యబ్బురపడుచు ముక్కుపై వ్రేలుంచుచు, దలయూంచుచు నతని దివ్యశక్తి కలది యవలం జేతులు జోడించి యిట్లనియె.

ఓ మహాత్మా! మీ రెవ్వరు? కపిలయోగీంద్రుండవా? దత్తగురుండవా? మీ ప్రభావముచూడ నత్యంతాశ్చర్యజనకముగా నున్నది. మీ నామధేయ మెయ్యది?

“ఓరీ! నీగానమును గవిత్వమును బరమేశ్వరుని గీర్తించుటయుండ వినియోగింపుము. ఆ భగవత్కళల నన్యంబునకు వినియోగింపరాదు. ఇటుచూడు : నా మహతీవీణతో నే నెల్లపుడు భగవంతుం గొండాడుచుందును. బృహతితో విశ్వావసుండు కళావతితోఁ దుంబురుండును కచ్ఛపితో సరస్వతియుఁ బురుషోత్తముం బాడుచుందురు. ఉత్తమమగు గానవిద్య భగవదర్పితయగునేని చెప్పవలసిన దేమున్నది? ఏమన్న, కుమారా! నీ వెంత పుణ్యాత్ముఁడవో! జగత్పతి శ్రీకృష్ణుండు నీకు సుకరంబుగ గానకళ నొసంగి యనుగ్రహించె. నే నెన్నిపాట్లుపడిన నిది లభించినదో యెఱుఁగుదువా? గర్వోన్నతుండైన తుంబురుండు నాకుమేలుసేసెను. ఇంకంబోయి నాకమునకో? వైకుంఠమునకో? సత్యమునకో? కైలాసమునకో? తుంబురుని వాదునకు లాగి గానసభలో గెల్చెద.

అన మణికంధరుం “డదియేమి? స్వామీ! తుంబురునితో మీకేల మత్సరము? ఏదియో కొంతకథ యున్నట్లున్నది.” అన నౌనోయీ! కథ యున్నది. పెద్దదే. నే నొక్కొక్కప్పుడు మానుషభావ మావహించుచుందును. ఎల్లప్పుడును దివ్యశక్తులతో నుండినను బనిలేదు. నాచిత్రకథను వినుము.

# 4. మజిలీ

నారదుండు మణికంధరునికిఁ జెప్పిన గానమాత్సర్యకథను మణిస్తంభుండు కలభాషిణికిం జెప్పుట

కలికీ! నారదుండు మణికంధరునితో నిట్లనియె. శ్రీమహావిష్ణు వొకనాఁడు వైకుంఠమున నిండు గొలువుదీర్చె. బ్రహ్మాదిదేవతలు సేవించుచుండిరి. యోగీశ్వరులు వేదాంతసూక్తుల వర్ణించుచుండిరి. శ్రీవత్స భృగు విశ్వామిత్ర మైత్రేయాత్రి మార్కండేయ కౌండిన్యాగస్త్య గౌతమప్రముఖ మహామునీంద్రులు గుంపులు గుంపులుగాఁ జేరఁ గొలుచుచుండిరి. అప్పుడు నేనును దుంబురుండును విశ్వావసుండును మొదలగు వీణాధరుల మొకకొందఱము భక్తితో నేగితిమి. ఇట్లు దేవముని సంఘంబులువచ్చి సేవింప విష్వక్సేనుండు వేత్రముధరించి సందడి యెడగలుగఁజేయుచు బరాబరి యొనరించుచుండెను. దేవదేవుండప్పుడు దివ్యవారాంగనా నాట్యంబవలోకించుచుండెను.

అట్టిసమయంబునఁ గొలువు కూటమునకుందరి వంకనున్న సింగారపుఁ దోఁటనుండి శ్రీమహాలక్ష్మీదేవి నిరుపమాన ప్రాభవముతో మేఘములనుండి వచ్చు మెఱుపుల పిండు నాప్రెగ్గడికత్తెలందఱుఁగో భజించుచుండ సభకు వచ్చుచుండెను. దవ్వుదవ్వుల నామహాదేవి గానంబడెనో! లేదో? యింతనేమిచెప్పుదు నతిసంభ్రమంబున వేత్రధరులనేకులెక్కడనుండియో వచ్చిపడి యాకొలువువారిం గకావికలై చనబాదసాగిరి. ఆవేత్రహస్తులిట్లు తఱుముచుండఁ బరమేష్ఠి యంతటివాఁడె యట

నిలువలేక యతిదూరము గాఁజనినిఁక మము బోంట్లకత తేజన నేటికి? పిదపనాసందడిలో "నోతుంబురుఁడా! ...న్న ... చ్చి స్వనము విన్పించెను. అంతలోఁ గొందఱు బంట్రోతులువచ్చి యతి వేగముగాఁ దుంబురుంగొం పోయిరి. అదిగని ప్రజలితని నేల పిలిపించెనో? యనియు, గానప్రసంగంబు లేమి వచ్చెనో? యనియు, నట్టైన నితండుగాక గానకళా నిపుణుండు వారిలో కండు లేఁడే? యనియుఁ, బలువురు పలు తెఱంగుల గుసగుస లాడఁజొచ్చిరి. నేనును నితనికిఁ బిలు పేల వచ్చెనో? యని విచారింపఁగా 'దేవీసహితుఁడై ప్రభువు తుంబురుగానము ... మహా నందముతో వినుచున్నాఁడ'ని తత్రత్యులవలనఁ దెలియవచ్చెను. మణికంధరా! ఆమాటలు నాచెవింబడెనో లేదో? ఒడలాపాద మస్తక మొక్కసారిభగ్గున మండెను. అప్పుడు నేనెక్కడనో దూరముగా నొకమూల నొదిగియుండ వలసివచ్చెను. నన్నుఁ దాఁకి తలఁచినవారు లేరు. కోటిజంగాలలో నీబోటి జంగ మెక్కడనో?

కొంతసేపటికి సురలు గుంపులు గుంపులుగాఁ గూడి గాన సభంగూర్చి ముచ్చటలాడు కొనఁజొచ్చిరి. 'సభముగిసెనా? ప్రభుసనిపెనా? ఏమిచ్చెనో? అనికొందఱు, సర్వేశ్వరుఁడు దేవీసహితుఁడై గానమాలించెనఁట! ఇఁక నడుగ నేల? అనికొం దఱు, సెక్కడ లేని యీయోగిపనయు శ్రీవారి యత్యంతాను గ్రహముందెల్పెడి పనికొందఱు, నీవొక్కండవే? మహత్వం బునఁ దోడు లేఁడా?' యని కొందఱును బలుకుచు సుర లరుదందసాఁగిరి.

అట్టియెడ నాసుగలగుంపులోనుండి వెలికివచ్చి మేపూఁత జంబుతోడను సన్నని పట్టువస్త్రంబుతోడను దేసలవారింగనక స్నానమాడించు పదకంబుతోడనుఁ దుంబురుండు నాకంటం బడెను.

కం. ధగధగయను పదకంబున
నిగనిగయను క్రొమ్మెఱుంగుల సితపటమునన్
భుగభుగయను మేపూఁతన్
భగభగ యనిపించె నతఁడు నాహృదయంబున్.

అప్పుడు మన్మనోంబుధిం బుట్టిన కల్లోలమ్ము లొడ్డునకు వచ్చి పైతేలునఁ గొట్టుకొనుచుండెను.

సీ. తనుఁ గ్రమ్మఱంగఁ బిల్చిన వేళయందు నా
తో విచారింపక పోవుటెట్లు ?
పోయెఁబో ! నను బిల్వఁజేయక తానొక
నెఱజాణయై విద్య నెఱపుటెట్లు ?
నెఱపెఁబో ! ప్రభువు మన్నించినాఁడని మీఁదు
పరికింప కీసామ్ము వట్టుటెట్లు ?
వట్టెఁబో ! దొంగ తేలుగుట్టినట్టి విడాఁచి
కొంచుఁబోవక మొఱయించుటెట్లు ?
లేఁడు తగవరి యెఁదును మూఁడిచొచ్చి
వాత వెళ్ళడునాఁడెయెన్నాఁడునంచుఁ
బాపి తుంబురుఁడా ! యంచుఁ బండ్లుకొఱుకు
కొంచు లోలోన నుడికిలిఁ గొంతతడవు.

ఏమి ? నాకంటెఁ దాను ఘనుఁడా ? ఆ కొంచెపుబండాలము నేను బయటఁబెట్టువఱకే తా నేపొగలఁబోయినను. ఇంతవఱకు సాఁగినవి కాని యిఁక వీనియాటలు సాఁగనిత్తునా ? తప్పించుకొని పోనిత్తునా ? అటో యిటో తేలవలసిన దే ! ఎంతైన వాదుపెట్టుకొని వీనిని రచ్చకీడ్చి నలుగురిలో నవ్వుబాట్లు సేసెద. మఱియు సంగీతచాతుర్యంబు క్రమంబుగా నీ జగన్నాయకుచెవిం బడునట్లు సేసెద. ఆయనచే మెప్పునొందక నిద్రపోదునా ? వీనిని నిద్రపోనిత్తునా ? యని యాసమయమున నాగ్రహోద్రగుఁడ నైతిని. కాని యితరులతోడి ప్రసంగంబు వలన నావల నొక్కింతతడవునకాయుడుకు కాఱినది. అప్పుడు నెమ్మదిగా నాలోచించితిని. ఏప్పట్లలో నేపాటున్నదో తెలియక ముందుగనే తొందరపడవచ్చునా ! కాన నిప్పుడే వీనితో బహిరంగవిరోధము పెట్టుకొనరాదు. పెట్టుకొన్నచో వీని లోటుపాటులు నాకెట్లు తెలియును ? కనుకఁ బైకి మైత్రినే ప్రకటించుచు నాయీర్ష్యను లోలోపలన యణంచుకొని రాకపోకలు జరుపుచు గానములో నతని గుణదోషముల నరసెదంగాక. త్వరపడినఁ గార్యములు నెఱవేఱునా ? వెక్కిరింపఁబోయి నొలికిలం బడవచ్చునా ? అని భావించి యెప్పటియట్ల వానితో సంభాషించుచుంటిని.

మణికంధరా ! పిమ్మట నేనొకనాఁడు తుంబురునింటి కేగితి. వాఁడు పాటకాయితముగ వీణమేళగించి వెలుపలిమోసల నునిచి
నారదుడు తుంబురువిద్య లోని కరిగెనోటు. నేనది యెఱుఁగక
కబ్బురపడుట తుంబురుఁ డింటనున్నాఁడా ? యని తత్ర

త్యుల నడుమ వీణియ నిచ్చటనుంచి యిప్పుడు లోని కేగినన్న మాటలు వినవచ్చె! నే నంతటనొయ్యన సమీపించి యిది వాని వీణియయే చూతమంచు మెల్లగా దానినందుకొని పలికింతుఁగదా. మణికంధరా! యేమిచెప్పుదు నయ్యపూర్వ శ్రుతి సమ్మేళనవైభవము. నే నత్యంతాశ్చర్య సముద్రమున మునిఁగి పోతిని. తోడ నేఁబ్రజయుఁ బొడమినది. అప్పుడిట్లు భావించితిని. "కష్టా! ఈ ప్రవీణుని నెఱుంగఁడు ప్రవీణుండ. సందియంబు లేదు. నాకన్నమిన్నయే. నేనింతవఱకు వీఁడింత వాఁడని గ్రహింపలేనైతి. నేనే మొనగాఁడనంచెంచితి. ఇసీ! తాఁడిఁ దన్నెడు వానిం దలదన్నువాఁ డుండును వీనికింతగానకళాసంపదగలదని విష్ణువు పిలిపించునంత వఱకునే నెఱుంగనైతిని. ఇరువురము కలసి పద్మభవాదుల యొద్ద గానసభలు చేసితిమిగదా! ఎందును వీఁడింతవిద్య తనకున్నట్లు ప్రకటింపలేదు. మొన్న విష్ణు సభలో విజృంభించెను.

క॥ తమవిద్య నెవ్వ రేమా
త్రముఁ గనఁజాలరను నారిదండను దన్మా
త్రమ ప్రకటింతురు బుధు లు
త్తముల మహిమ నీరుకొలఁది తామరసుమ్మీ

ఎప్పుడును దామరాకు నీటినిమించి యుండదు. నీళ్ళలో మునిఁగియు నుండదు. కాన సలిలవేఁడు నీటిలోఁ దామర కాడయు నిలివెఁడుండును. మోకాటి బంటినీటిలోను మోకాటి బంటి తామరకాడయు యుండును. అట్లు గ్రహింపబట్టి యుత్తములు తమవిద్యను బ్రకటించు చుందురు.

కం॥ ఇటుగాక విను జనంబుల
పటిమకు నెక్కుడుగ విద్య ప్రచరించుట యు
క్కట విఫలముగాదే ? యె
చ్చటఁ జెవిటికిం బట్టిపట్టి సంకును బోలెన్.

చెవిటివానికడ శంఖమూఁదిన నది వానికి వినఁబడదు. కాన మన ప్రయాసము వ్యర్థము. అర్థగ్రహించు శక్తిలేనివానికడ నధిక విద్యనుఁ బ్రసరించుట నిష్ఫలము.

నారదుని పట్టుదల

అందువలన బ్రహ్మాదుల సభలలో నితఁడు తపశ్శక్తింజూపలేదు కాఁబోలు. అదిరయే నెఱుంగక వీఁడునాతో సముండ యని భావించితి. కటకటా! తొందరపడి వాని డీకొన్నచో నాకశృంగ భంగమయ్యెడిది. నిదానించుటకు నాకు లగ్గైనది. బుద్ధి బుద్ధి! ఎవ్వండును గర్వపడరాదు. విద్యకుఁబారము లేదు. నాలుగుకృతులు వచ్చినంతమాత్రమున నెవ్వఁడు గాయకసార్వభౌముడుగాఁడు. నే నింతటం దెలిసి దెచ్చుకొని గానకళారహస్యముల సాధించెదఁగాక యని యుదిమొదలుగాఁగ నెక్కడెక్కడ నక్కజపుగాన విద్యగలవారు గలరు వారినరసియరసి తద్విద్య సాధించుచుంటిని. విద్యార్థికి దురభిమానము కూడదుగదా ఇట్లు సాధించుచు నెడనెడఁ దుంబురుకడకేగి పాడుచు నొకసారి వాఁడు 22 శ్రుతుల విస్పష్టముగాఁ బాడి విన్పింపుమన నాలుక వెళ్లఁబెట్టితిని. అవలమఱియు నభ్యసించి వానికడ కరుగ సీతూరి గాంధారగ్రామముం జూపుమనె. దానినెట్లో వెళ్లఁదీసితిని గాని వాఁడు పాడినట్లుండలేదు. ఇట్లు

పెద్దకాలము 'స్పర్ధయా వర్ధతే విద్యా' యను నార్యోక్తిం బాటించి లజ్జాభిమానములవదలి విద్య నార్జించుచు నుంటిని. కాని యేమి లాభము! తుంబురు మించలేనైతి సరికదా. సమానముగూడఁ గానైతిని. ఇఁకనెందఱి నాశ్రయించినను లాభము లేదని తపంబున కసాధ్యమైనది లేదు గావునఁ దపంబాచరించి సర్వజ్ఞుఁడైన పుండరీకాక్షు ననుగ్రహంబు వడసెదంగాక యని చిరకాలము తపమొనర్చితిని. అంత నాదేవ దేవుండు సుప్రసాద సుముఖుండగుచుఁ బ్రత్యక్షమై వత్సా! ఏమి కావలయుఁ గోరుకొమ్మనుటయు నేనత్యంతభక్తి నతులు నుతులు సలిపి తుంబురుగానకలనవలన గెలువ వలయునంటిని. అనుటయు శ్రీమన్నారాయణుండు కృపాకటాక్షంబుల నాపైఁ బఱపి నేను ద్వాపరంబున వసుదేవునకుఁ బుత్రుఁడనై జనియించి శిష్టరక్షణము దుష్టశిక్షణము నాచరింతును. అప్పుడు ద్వారకలో నీకోర్కెం దీర్తు. నాటికి రమ్మని యంతర్ధానంబునొందె. చిరకాలమునాటి కోర్కె యిప్పుడు తీఱినది. మణికంధరా! నేనిన్ని పాట్లుపడి యీ గానకళం గంటిని. నీవుం గలభాషిణియుఁ జెక్కుచెమర్పక యుండ హరికరుణనప్రయాసమునం గంటిరి.

నావుడు మణికంధరుఁడు మాకిది లభించుట తమచలువనే.

**నారదుఁడు మణికంధరునకు హితము చెప్పుట**

తమ్ముఁజెందిన వారు తమంతవారన్నట్లు మిమ్ముఁ గొల్చి మాకిది యోగ్యయగుదా? అది యట్లుండెఁగాక మహాత్మా! నా వాంఛితము మఱొకటి గలదు. తుంబురుంబోలె నైపుణ్య మందుంగి

యెల్లపుడు శ్రీమన్నారాయణుని గొల్వఁగల్గెడుమహాభాగ్యము నాకు లభింపఁజేయుఁడననారదుండిట్లనియె.

మేలుమేలు : నీకు నుత్తమమైన వాంఛయే పొడమినది. లోకమం దెందఱు లేరు విధినిషేధములను పుణ్యపాపములను మేలుగీళ్ళను దెలిసినవారు ? వారి కెవ్వరికైన నిట్టి నిశ్శ్రేయస వాంఛ పొడముునే ? కొందఱు వేదవేదాంగముల నభ్యసించి తదర్థం బెఱింగియు మరలఁ గర్మవాసనలంజిక్కి పెరవేల్పులం గొల్తురు. వెఱ్ఱిదీరె లోకలింగలఁ జుట్టుమునువా రిట్టివారే.

సీ॥ వినుము గంధర్వనందన ! భూతములయందుఁ
ప్రాణు లుత్తమములు ప్రాణులందు
బుద్ధిజీవులు మేలు బుద్ధిజీవులయందు
మనుజులు శ్రేష్ఠులు మనుజులందు
బ్రాహ్మణు లధికులు బ్రాహ్మణులందు వి
ద్వాంసులు ఘనులు విద్వాంసులందు
విదితార్థకృతిలోల హృదయులు ముఖ్యులు
విదితార్థకృతిలోల హృదయులందుఁ

గీ॥ కర్తలెంతయు ముఖ్యులు కర్తలందు
బ్రహ్మవిదు లెక్కుడనిరిఁదఁ బరమమునులు
గలుగదనుచును మున్నుఁదాఁ బలికె మనువు
ధర్మశాస్త్ర ప్రసంగవర్తనలవేళ.

కాననీవు లక్ష్మీవరు నిత్యసాన్నిధ్యమపేక్షించితివి. ధన్యుఁడవోయీ!

క॥ అధికారి కానివానికి
నధికపదవిఁ దెలుపఁ బ్రాప్త మయ్యెడుఁ బాపం;
బధికారియైన వానికి
నధికపదవి దెలుపకున్ననగు నిక్కముగన్

వత్సా! మోక్షమధికారికిఁ దెలుపకున్నఁ బాపము, నసధికారికిం దెలిపినఁ బాపము. కాన నధికారివగు నీకు నీయడిగిన యర్థముపదేశించెద వినుము.

సీ॥ తనశక్తికొలఁది సత్కర్మముల్ ఫలవాంఛ
మాని కృష్ణార్పణమతిఁ జలుపుట
ప్రతిషిద్ధకర్మంబు పరిహరించుట విష్ణు
భక్తిపైఁ గ్రమమునఁ బాదుకొనుట
తద్భక్తిగల పుణ్యతముల సంసర్గంబు
దుర్జనులున్నట్టి ద్రోవఁ జనమి
విష్ణుసన్నిధి కళావిఖ్యాత వివిధ ది
వ్యక్షేత్ర తీర్థయాత్రాచరణము
గీ॥ బ్రహ్మచర్యంబు, తపము, వైరాగ్యగుణము
వలయు నైష్ఠికమును గోరువారికెల్ల
పనిలోపలఁ గొన్ని కావింపఁగనిన
వృథచనవు చేర్చుఁ గ్రమమున విష్ణుపదము

వత్సా! తెలిసినదా? తనశక్తికొలఁది సత్కర్మములాచరింపవలయు. అట్లాచరించి యందువలన వచ్చుఫలమును గోరరాదు. మనము చేయు ప్రతి కార్యమును భగవంతున కర్పింపవలయు. చేయఁగూడని కార్యములఁ జేయరాదు. క్రమక్రమముగా విష్ణువునందు భక్తిని నిల్పుకొనవలయు. విష్ణుభక్తుల స్నేహము నే చేయవలయు. దుర్జనులున్నచోటు నకు కషణం టిక్కొనైనఁ జూడరాదు. తీర్థయాత్రలు చేయవలయు. అతీర్థములందు దివ్యక్షేత్రంబులందు విష్ణుకళ యావరించి యుండునురా. మఱియు సంసారమునందు వైరాగ్యమును సృష్టి చేసికొనవలయు. బ్రహ్మచర్యంబును దపంబును ముఖ్యములు. ఇవి యన్నియు నున్నవారికి వైకుంఠ మఱచేతిలోనిదే. వీనిలోగొన్ని యున్నను వ్యర్థగావు. అవి క్రమముగా వానిని విష్ణుపదము చేర్చును.

నాయనా! నీవు నీశక్తికొలఁది వీనినాచరింపుము. కృష్ణానుగ్రహంబునఁ గలిగిన యీ యసదృశసాధారణ సంగీతచాతుర్యంబు వ్యర్థసేయక శ్రీరంగాది దివ్యక్షేత్రంబులందు ముకుంద సన్నిధిం దద్దివ్యగుణంబుల గానము గావింపుము. అని సకల శ్రేయంబుల నొసఁగుమని పలికి తదవసరంబున నారదమహర్షి భక్తిభావ ముద్రేకించుటచే గోవిందనామ కీర్తనగావించుచు మ్రొక్కుచుఁ బొగడుచుఁ బులకించుచుఁ జెంగలించుచుఁ గన్నులు మోడ్చుచు నాట్యమాడుచు నోటలు పలియక యొక్కరుండ యొందేసరిగె. కలభాషిణీ! నారదునివంటి భక్తుఁ డెవడుఁ గలఁడు. అతని చేష్టలు మరవగామములు.

## 5. మజిలీ

మణిస్తంభుఁడు విస్మయ వికసితనేత్రయై వినుచున్న కలభాషిణితో మఱియు నిట్లనియె. కలభాషిణీ! యిపుడు నీవడిగిన విషయమునకు వచ్చితి. వినుము. అట్లు నారదమహర్షి చన్న పిదప మణికంధరుండు గురూత్తమునియందుగల దైవభక్తి, హితవాదిత్వము, గురుశుశ్రూషవలననే విద్యనార్జింపవలయు నన్న పట్టుదల, పరుల దుర్గుణంబులఁ దొలఁగించుట యందలి నేర్పు శిష్యవాత్సల్యము మొదలగు సద్గుణముల నెంతయో తడవు స్మరించుకొనుచుండెను. ఇట్టి మహానుభావు మూఢలోకము కలహాభోజనుఁడని తలంచుటకు విచారించెను.

మణికంధరుని తీర్థయాత్రాదులు

పిదప నాగంధర్వుండు పుణ్యకర్మముల యథాశక్తి నాచరించుచు విష్ణుభక్తి హృదయంబునం బొదలఁ దీర్ఘయాత్ర గావించెను. మధురాధిపు సుధామధురకథల నవధరించె. బదరీనారాయణు నుదారవచోరీతుల నారాధించె. ప్రయాగమాధవు పాదపాథోజరజమున సాధారణబుద్ధితో సాగించె. ఐశ్వర్యదాయకుఁ గాశికా విశ్వేశ్వరుఁ గైవార మొనర్చె. జగన్నాథు హృత్సరసిజమున సన్నుతించె. సింహాచలనృసింహు ననంతస్తుతిపొంద సేవించె. అహోబల నృహర్యంఘ్రుల నహీనమతి సహాయుఁడై మౌళి వహించె. తిరుపతి వేంకటరమణు చరణసరసిరుహముల కెరగి నతజనకరుణా వరగాన మొనర్చె. కాంచి వరదరాజుం గాంచి మించి ప్రస్తుతించె. కావేరిం జేరికొని యవ్వారినవ్వారిగఁ గ్రుంకులిడె.

చుంటివని యనుకొనను. అదె యాపొదచాటుగా నిరువురు చెలు లిప్పుడువచ్చి గులాబులకు నీరుపోయుచు నీమాటలు మాటలాడు కొనుచుండిరని యమ్మాటలు సెప్పి వారింబిలిచి యరయుమని తటిమితటిమి పలుక నాగరిత చేయునది లేక యాచెలులం బిల్చి వారి పలుకులుం బనులు తెలిసికొని యోగి చెప్పినట్ల యుండ నాపె వారింబంపి యతియనుగుల ప్రాలి మదిలోని కోరిక యూరక లెత్త లేచి చేతులు జోడించి నిలువంబడియె.

## 6 వ మజిలీ

శుకము సాక్ష్యము

ఇంతలో నాసమీప ఫలవృక్ష శాఖలపైనున్న యొక శుకము సిద్ధపుంగవా! నీమాటలు యథార్థంబులు. అవి నా మనంబునకును సరిదాఁకెననం గలభాషిణి విస్మిత హృదయయై యాపలుకు వచ్చినదెసకు వినీలకటాక్ష మాలికలం బఱపి శుకంబుం గనుంగొని శుకమా! నీవెంత చతుర తరమతివే. నీమది కేది సరిదాఁకె. నిజము చెప్పుము. విని సంత సించెద ననన నాపక్షియిట్లనియె.

అమ్మా! నానివాసము నందనవనము. మొన్న వనజా క్షుండు తద్వనమునుండి పారిజాతమును బెకలించి తెచ్చుచో నాశాఖయందలి పక్షులు ఱివ్వుఱివ్వున నెగిరి మరల నాకమునకు బర్విడసాఁగె. నాభార్య ప్రసవార్తయై వానితోఁగలిసి పర్విడ లేక యెస్లినదయ్యె. నేనచటనె యుండెద. కదలలేను. తర్వాతం జూచికొందము. అని నాతోఁబలికి యాపారిజాత తరుకోటర

రంగనాయకుం బొంగుచుం గీర్తించె. కుంభకోణమునం గుంభే శ్వరు సంభజించె. దర్భశయనంబున రామభద్రు నిర్నిద్రభక్త్యా విర్భావమ్మున వర్ణించె. సేతుబంధనంబున రామేశ్వరుం బ్రీతి విశ్వాసంబుల బూజించె. అనంతశయనంబునం బద్మనాభుని సాన్నిధ్యంబున గాంధర్వవిద్యాప్రాద్యంబుగా నెఱపె.

ఇట్లు మణికంధరుం డెన్నియో దివ్యక్షేత్రరాజంబులను భక్తి ప్రపత్తుల నరుగుటచే నిర్మలచిత్తము హత్తుకొనియె. అక్కటతన ననంతశయనంబు చక్కటికిం బడమటిదిక్కునం గల వనవాటి యందు నిలిచి తపంబుసేయ దొరకొనియె.

కలభాషిణీ! మణికంధరుండు తనయాత్రయందుం బ్రతిస్వామి సన్నిధినిం దద్గుణగణంబుల సంగీతసాహిత్యములం బొదిగి గానంబు సేయుచుంటచే నాకరంబున నాలించుచు నానందసముద్రమున నోలలాడుచుంటిని. ఇప్పుడట్టిది లేదు. గానంబు చాలించి తపం బున కొగ్గె. కలికీ! యనెచూడు. పద్మాసనస్థుండైయున్నాఁ డనం గలభాషిణి యెంత యద్భుతము. ఓ మహాత్మా! మీకనంగన శిప్పుడు సర్వప్రవర్తనములు కనంబడుచున్నవని [illegible] నన మునీంద్రుండు చెలియా! జంకంగొంకేమిటికి? నీ [illegible] నిద్దరిం బిలిపించి చప్పుగాం బంపుము. తత్తత్క్రియ లెల్లం జెప్పెదనన నవ్వానిత వలదుస్వామీ! మిమ్మెంత పరీక్షింప నలంతినే? మీ పల్కులం దబ్బరంబకాని యనుమానంబు లేదన [illegible]న నిందేమి తప్పగలదు. ఇదొకవినోదము. చూతువుగాక. ఎవ్వరి నేని బిలువుము. పోనీ నేనపిలిచెదనన్న వారు భయంబున రారో యని శంకించెద. కలికీ! జంకకు. నీవు నన్ను వేఱుగాందలంచు

చుంటివని యనుకొనను. అదె యాపొదచాటుగా నిరువురుచెలు లిప్పుడువచ్చి గులాబులకు నీరుపోయుచు నీమాటలు మాటలాడు కొనుచుండిరని యమ్మాటలు సెప్పి వారింబిలిచి యరయుమని తటిమితటిమి పలుక నాగరిత చేయునది లేక యాచెలులం బిల్చి వారి పలుకులుం బనులు తెలిసికొని యోగి చెప్పినట్లయుండ నాపె వారింబంపి యతిపుంగవుల ప్రాలి మదిలోని కోరిక దీరిక లెత్తి లేచి చేతులు జోడించి నిలువంబడియె.

## 6 వ మజిలీ

శుకము సాక్ష్యము

ఇంతలో నాసమీప ఫలవృక్ష శాఖలపైనున్న యొక శుకము సిద్ధపుంగవా! నీమాటలు యథార్థంబులు. అవి నా మనంబునకును సరిదాఁకెనని గలభాషిణి విస్మిత హృదయయై యాపలుకు వచ్చినదెసకు వినీలకటాక్ష మాలికలంబఱపి శుకంబుంగనుంగొని శుకమా! నీవెంత చాతుర తరమతివే. నీమది కేది సరిదాఁకె. నిజముచెప్పుము. విని సంత సించెద నన నాపక్షియిట్లనియె.

అమ్మా! నానివాసము నందనవనము. మొన్న వనజా క్షుండు తద్వనమునుండి పారిజాతమును బెకలించి తెచ్చుచో నాశాఖయందలి పక్షులు చెప్పుటెప్పున నెగిరి మరల నాకమునకు బఱ్ఱడసాఁగె. నాభార్య ప్రసవార్తయై నాతోఁగలిసి పర్విడ లేక యెక్కినననయ్యె. నేనిచటన యుండెద. కదలలేను. తర్వాతం జూచికొందము. అని నాతోఁబలికి యాపారిజాత తరుకోటర

మంద డాగియుండెను. పిదప నది యందు ప్రవహించెను. పిల్లలకు రెక్కలు వచ్చినయెడల దీసికొనిపోవ ననువుగాదుగదా. ఆ పిమ్మట వచ్చి పిల్లలతల్లిని రమ్మన నది నందనముకంటె నివ్వన ము కడుంగడు లెస్స. నీకు నందనమ్ముపై నేలపెనిమొపవలదో ? యనుడు నేనునదినిక్కము. అయినను మనవారందఱు నచటన యుండిరిగదా యంటిని. అన్నను నాభార్య యిష్టపడ లేదు. కాన నేనుదివియందలి చుట్టపక్కముల దగ్గఱకు భువియందలి యాలుబిడ్డల దగ్గఱకు నప్పుడప్పుడు రాకపోకలు సేయుచు నుందును. తమ పదువుం జూసి యొంటరిగా నుంట కిష్టపడనుసుమా!

అట్టి నేనిప్పుడు పుష్కరవీధినుండి వచ్చుచు మణికంధరుండనుచు మీరలాడికొను మాట వినంబడిన నతనినుద్ది యక్కడ కలుగుటకు నిమిత్తంబేమి కలిగెనో ? తెలిసెద నని నిలిచితి. ఈ సిద్ధపుంగవుండు నీకుం జెప్పిన తీర్థయాత్రా తపశ్చర్యల వృత్తాంతంబు నిక్కంబుగాం దెలిసిన ప్రకారము వివరించెద వినుము.

నేడు శచీపురందరులు నందనవనమున విహరించుచుండ నొక చారుం డేతెంచి, యింద్రునితో నిట్లనె " దేవా! నేనున్న వనమున కొక తీర్థవాసి కొన్నాళ్ళక్రిందట వచ్చె. వానితో మాటలాడితిని. కానల్ల తీర్థములు పుణ్యభూములు సేవించినచ్చెనంట. అతఁడన్వనమున నొక్క మూసికొని కూరుచుండ మొదలుపెట్టెను. నేనదియోగ జపము గదా యనుకొంటిని. కాదుస్వామీ! అది తపము. అదియట్లు పెరిగి నానాటికి వృద్ధిగాంచెను. బ్రహ్మరంధ్రమునుండి

ఇంద్రుఁడు మణికంధరు తపముచెఱుప రంభనంపుట

జాజ్వల్యమానకరాళ జ్వలనజ్వాలాజాలంబులు బయలుదేరఁ జొచ్చెను. నన్ను మీరవ్వానికంపుచు "నోరీ! ఈవనమున నెవ్వండు తపమొనర్చినను నెనిమిది నెలలలో సిద్ధించు. కానఁ గనుఁగలిగి మెలఁగుచు నాకు జెప్పవలయునని యానతి యిచ్చితిరి"

అన నింద్రుం డౌనౌను. జ్ఞప్తికి వచ్చినది. నీవరుగుమని వానినంపి రంభనుబిలిపించి, ఓలలితాంగి! వింటివా! యొకడు సురరాజ్యలక్ష్మిఁగోరి కావలయు నితాంత దుర్గమాభీల తపో ధురంధరతఁ బేర్చి యున్నాఁడు. ఆ చారుఁడు వాకుచ్చిన దంతయుఁ జెప్పె దీనికి నీవు వెంటనే చికిత్సచేయ వలయు. ఆలసింపరాదు. గోరంతాలస్యంబునఁ గొండంత ప్రయోజనము దప్పును.

అన రంభ జంభవైరిం జూచి యమ్మునీంద్రుండన నెవ్వం డని దేవర చిత్తంబున నున్నదియో? అతండు నారదశిష్యుం డైన మనోగంధరుండని మాకు వినంబడియె. అతని నిటమున్న పరికించుచుందుము. అస్మదాదుల విలాసంబులెవ్వియు నెన్నండును సరకుగొని చూచినవాఁడు కాఁడు. నేడు విశేషించి తపశ్చర్యాతాత్పర్యంబునఁ బ్రవర్తిల్లుచున్నవాఁడు. కావున నవశ్యంబు దేవకార్యంబు నిర్వహింతుననలే"నన సురపతియొల నవ్వదొలఁక "నేల యీనీల తేలనాడెదవు. వాలుగంటీ! నీకుఁ దొంటికంటె వయోరూప లావణ్యవిలాసంబు లెక్కుడుగ వరంబొసంగితి. సందియంబు వలదు. పొమ్ము. నీ పుణ్యంబుఁ జూపుము. సిద్ధింబొందిరమ్ము." అని పలుక నది మాఱుపలుక

లేక యచ్చరలందోడుగైకొని ధరణికిరాఁ బయనమయ్యె నేను ముందు తొందరగా వచ్చితి. ఇంతకు వారు తపోవనంబుం జేరఁ బోవుదురు. కాన నిమ్మహాసిద్ధపుంగవుని వాక్యములు యథార్థంబులని పలికితిని.

అన వేశ్యారత్నము కొంతసేపాచిలుకంబొగడి నిను బెడఁబాయనెడఁద యిచ్చగింపదు. కాని నీవు నీపెండ్లముం బిడ్డలం జూడఁ బోవలయుఁగదా. ఆఁగుట దోసంబని పలికెదాని ననిపె.

అంత మణిస్తంభుండు మగువంజూచి 'ముద్దరాలా! ఎన్నిదినంబులనుండియో నిట్టుపాసముం బూనియున్న నాశ్రవణములచే సుఖపారణ చేయింపవా?' యన నామె వెంటనే వీణనందుకొని గానమాధుర్యము చుబ్బనచూఱనిచ్చె.

## 7 వ మజిలీ

*రంభ మణికంధరు తపము చెఱచుట*

రంభ ఇంద్రుని మూదల నౌదల ధరించి చెల్మికత్తియలఁ దోడుసేసికొని యవనికవతరించి మణికంధరుని గనుంగొనియె. అతండు కరుడుగట్టిన తపంబువలెఁ గుప్పవోసిన వైరాగ్యమువలెఁ బ్రోవుసేసిన తేజఃపుంజమువలె నామెకంటికిఁ గన్పడసాఁగెను. అచ్చరలెవ్వరు నతని యుగ్రదృష్టికెదురుగాఁ జన నోపరైరి. భయాతిరేకంబున నీవు ముందంచు నీవుముందంచు నొకరివెనుక నొకరొదిగి యుండఁజొచ్చిరి. రంభారంభోరువు వ్యాధనితాంభో

జము స్తంభించె. కాలుముందుకు సాగదు. బళిరే! శక్తి యున్నం దపశ్శక్తియే ?

అట్టిచో రంభ మదిలోఁ 'ఔట్రా! యిట్టినట్టికసీల కెట్టుచెట్టు నోడింగట్టనేర్తు! దేవకార్యము నాకలనం గుంటుపడునట్లున్నది.' యని జంకుచుఁదలపోసె. అంతం గొంతతడవునకుఁ దనకుఁదాన ధైర్యమవలంబించి రంభ చెలికత్తియలంగూడి సందడియగు నట్టు లాటపాటలు నెఱపుచు నంతటంతట విహరించి మెల్ల మెల్లగా ముని యెట్టయెదుటకు వచ్చి నడుము జవ్వాడ, గజ్జెలు తాచుం బోలు వాలుజడనుండి విరిసరంబులూడ, నుత్తుంగ నక్షోజముల నుండి పైఁటతూగాడ, రత్నాలహారాలు తళతళలాడ, నొయ్యారముగా నభినయించుచు నొక జావళింబాడె. దైవికముగా మణికంధరుండు కనులు తెఱచిచూచె. రంభోరువు మనోహరముగాఁ బొడకట్టె. వెంటనే కనులు మూసికొనె. హృదయమునను దద్రూపము ప్రతిబింబించె. దానిం దలంగుటకు మరలంగన్నులు విచ్చె. ఎదుట నదేరూపము. తళుక్కున వలపుమెఱుపు మెరిసె. మది చలించుటకు సహింపక కృష్ణకృష్ణయని భగవత్స్మరణము సేసి వెంటనే నిమీలితాక్షుండయ్యె. కాని యమ్ముని హృదయము కేళ్ళుపాఱంజొచ్చె. పగ్గములు తెగిన గుఱ్ఱములవలె దలంపులు పర్వ మొదలిడెను. మణికంధరుండు వలంబడ్డ పులుఁగుంబలె గిలగిలలాడఁజొచ్చె. కామధైర్యముల పోరును మాన్ప లేకపోయెను. మనస్సు మెత్తంబడ ధైర్యమిక నేమిసేయఁగలదు. క్రమముగా నా కుస్తీలోఁ గామమే ధైర్యమును జిత్తుచేసెను. తాపసుని చిత్తహంసి యాతలిరుఁబోడి లావణ్యామృత సరస్సులో

నోలలాడుచుఁ బైకి రాలేకపోయెను. మానవతి యల్లన రంభ నిలువెల్లం జూచుచు నింత యుజ్జ్వలరూపలావణ్యము లిదివరకు లేవయని చెప్పనాల్పుఁడయ్యె. అచ్చరబోటి పకపక నవ్వి, కేరిగంటిచూపులఁ దూపులఁబోసెను. గంధర్వకుమారుం డప వర్గమునకు మఱొకసారి చూచుకొందము లే. ఇప్పుడే యేమి తొందర? యని యచటినుండి కదలి నవ్వుచు దానిచేత కరిగి 'సుందరీ! యెందులకై యిందరు దెంచితివి? సఖీ! యని పలుకుం దేనెల నా శ్రవణపుటంబుల నింపు' మన నది మూసిమూసి నవ్వులతో సిగ్గుమాలుకొనుచు మోముపంప నతండు పట్టరాని తమకంబున నీవు నా తపఃఫలంబవకదే యని దాని కౌఁగొనసిపట్టు నది యొయ్యన లేనగవుఁజూపులఁ బఱపుచు నాకాపాదరింటం బువ్వులుగోసి పెట్టుమని యతని చేయిపట్టుకొని తోఁటఁ గొని పోయె. రంభచెలులు చప్పట్లు చప్పటించుచును గొల్లుగా నవ్వుచు దవ్వుగాఁ జనిరి.

## 8. మజిలీ

ద్వారకలోఁ గలభాషిణి కొంతతడవు గానమాధుర్యము చవిచూప మణిస్తంభుం డాలించి "ఆహా! మణికంధరుని మఱపించితివిపో! యని నాపై

కలభాషిణి తన వాంఛితమూఁదీర్ప మణిస్తంభుని వేఁడుట

వీణియ నక్కల నిలిపి స్వామీ! వినవేడుక యగుచున్నది. మణికంధరుని తపము రంభకతమున నేమయ్యెనో? యనుటయు

చూపిం బఱపి నిలువబడిన నతం డొక్కింత తడవట్లనేసి నవ్వుచు, 'మగువా! ఇంకెక్కడి తపము. మణికంధరుండు రంభ కౌఁగిటం జిక్కి సొదగింపంబడి యున్నాఁడు.' నావుడు వేశ్యామణి మదిలో నేమి తలంచెనో సిద్ధపుంగవునికి నమస్కరించి యిట్లనియె. 'స్వామీ! మీవంటి మహాప్రభావ సంపన్నుల కాతిథ్యమీయఁగలుగుట యెంతటి యదృష్టము. తమరు మాయింట నొకటి రెండు పూటలు నిలిచి మా యుపచర్యఁ గైకొని మముఁ గృతార్థులఁ జేయవలయు' నన నతండు పకపక నవ్వి 'గానలోభంబు నన్ను నీ సదనంబునకుం దెచ్చె. నెలఁతా! నేను వాగుపీగునుంబలెఁ బట్టణంబుల నెట్టుకొని యిట్టునట్టు నసింపనులు నహాపనార నా కోరు. సాధుప్రకారంబున నిలుప నోపు దేని నీయుపచారంబులు గైకొనెద. సంగీతసుఖం బనుభవించెద' నటంచు నట్లు చేయుటకు సని తనగృహారామంబునందు నిల్పి యుచితగౌరవంబుగా నాయతికి నిష్టంబులైన యన్నపానాదుల మోదంబొనర్చుచు నచ్చటికి నెవ్వరిం బోనీక తాన పరిచర్య సేయుచు రెండుమూడు దినంబులు హృదయంబు రంజిల్లఁజేసె. దాని మదిలో నేమి కలదో! వాని మదిలో నేమి కలదో! ఈశ్వరుఁడెఱుఁగు. సిద్ధపుంగవుం డానందించునట్లించుక తడవు వీణామీటి యావల నలకూబరుపై ప్రేమతీవలు సాఁగ నల్లన నమ్మానిని సల్లాపించుచుం గ్రమంబుగా రంభ యూసు దెచ్చె

కలభాషిణి: మహాత్మా! మణికంధరుండు తెలివి దెచ్చుకొని తపంబున కొగ్గెనా? లేక రంభ కౌఁగిటనే మున్గెనా?

మణిస్తంభుం డద్దెసకుం జూడ్కి పఱపి "ఓం రంభ కౌఁగిటనే వాని తపంబు. ఇప్పుడక్కడ యున్నాఁడా ఘనుఁడు.

కల : వారలింక నచ్చోటువాసి పోయెదరో? యచటనే యుందు వారో ? దయచేసి చూచి చెప్పుఁడు. మదిలో శంకింపకుఁడు.

మణి: నాకేమి శంక? ఆతికిం జక్కిలిగింతలా? ఎన్నిమారులు చూడుమన్నం జూచెదను.

అని యద్దెసం జూపు పొలయించి చెఱియొగ్గి కలభాషిణి సద్దు సేయకుండ నోరకేల సన్న సేయుచు నాకించుకసేపు నిట్టి "ఓరా! వారకామినుల మేలిట్టిదే" యని నవ్వంగా గలభాషిణి 'అది యేమి! స్వామీ! నవ్వితిరి. ఏమివింతలు! నన్నన్యకామినిఁగా దలంపకుఁడు. ఆసంగతి చెప్పుఁడు.' అని గుచ్చిగుచ్చి యడుగ మణిస్తంభుం డిట్లనె "

"నీరజాక్షీ! నీకేమని చెప్పుదు? అపుకొన్నను నవ్వాగుట లేదు. ఆటక్కులాడి రంభ మణికంధరునితో గ్రీడించుచుం గనులు మూసికొని "విడు విడురా! నలకూబరా! యనియె. అనఁ గలభాషిణి ఇట్లనియె. దేవా! ఇందు నవ్వ నేమిగలదు? కుబేరనందనుం డంతముద్దుగాఁ దన్నేలుకొనుచుండెఁ గాబోలు. సరియేకాని! స్వామీ! ఇపుడు నలకూబరు డెందున్నాఁడో? యన సిద్ధుండు నవ్వుచు నీకిదియకదా ప్రధానప్రయోజనము. అని పలికి మరల నిటునటు పరికించి "యంగనామణీ! నలకూబరుఁ డిపుడు మణికంధరుని తపోవన సమీపముననే యొక రసాలవృక్షచ్ఛాయ నున్నాఁడు. తాను వెనువెంట నున్నచో

రంభ దేవకార్యము నిర్వహింపదనియు, నక్కలిన నింద్రుండు కుపితుండగుననియు, నిట్టి కార్యావసరములందు నలకూబరుండు రంభవెంట నుండక యొంటరిగా నుండి గ్రుక్కిళ్ళు మ్రింగుచుండును. అని పలికి కలభాషిణీ! నీవతనిపైఁ బరాకుచే గాన పాటవముం జూపలేవు, నావచ్చినపని యయ్యె, మఱొక పని నాకిట నేమికలదు? నేనరిగెదనన నప్పలంది 'స్వామీ! మీ దాసురాలి నేమినేని పోయెదరు? నాపాలి భాగ్యదేవత మిమ్మిట కుఁదెచ్చెనని నమ్మియుంటిని.

మణి: సరే. ఇప్పటివలెనే యెప్పుడెప్పుడు వచ్చి పోవుచుండెదను లెమ్ము.

కల: అదిగాదుస్వామీ! దేవరవారు నన్ననుగ్రహింపవలయు. నాకోరిక యీడేర్పవలయు. నాప్రాణములు నిలుపవలయుం. నన్ను నలకూబరునితోఁ గలుపవలయు, నేను మీ శరణు జొచ్చితిని. "అన్యథాశ్శరణంనాస్తి త్వమేవశరణం మమ" మీకంటెఁ బ్రభావసంపన్నులెవరుగలరు స్వామీ! ఉన్నను నింత దయగలవారు గలరే? నిజము చెప్పుచుంటిని. నన్ను మీరువదలి చన్న మరునిముసమునందే నాప్రాణములును నన్నువదలి చనును. అని కంట నీరుపెట్ట సిద్ధంజెట్లసిరియె.

నలంతా! తలంచినంతలో నాయనకడ చేర్చునంతటి యుపాయము నేర్చునఁ దాఁచిపెట్టుదునా? అనుకొనరాదుగాని నిన్నుఁ జేర్పియుకడఁజేర్చి నీప్రాణములుగాచి నీపాట విన నంత తహ

తహ లాడుచున్నాఁడనో యెఱుఁగుదువా? పిచ్చిదానా! అనంత శయన మెక్కడ? ద్వారక యెక్కడ? తుదకు మాగురువులవా రిచ్చిన యద్భుత గమనశక్తిఁగల యీ సింహవాహనమైనం గొని పోవుటకు నాలుగుగడియల కాలము పట్టునే!

కల : పోనిస్వామీ! నాలుగుగడియలైననేమి? అక్కడికి జేరినఁ జాలు.

మణి : చేలా! చేరినంతమాత్రమున గార్యసాఫల్య మెట్లగు? ఆనలకూబరుఁడు నీ ముక్కుమొగ మెఱుఁగడే. అతండు నిన్నెట్లంగీకరించును?

కల : ముందచటికిఁ జేర్చి పుణ్యము గట్టుకొనుఁడు. తర్వాత నా తిప్పలు నేను బడెదను.

మణి : నాకీ వాహనసాధనము తప్ప మఱియొండు లేదు. నీను నీవు వాహన మెక్కఁగలవా? ఎక్కినను గగనమందరుగు చోఁ గనులుతిరిగి పడిపోవా?

కల : ఓం... అంతమాత్రము తమకు దయయున్నఁజాలు. నేను ధైర్యముగా వాహన మెక్కి రాఁగలను. నేను గుఱ్ఱపుస్వారి నేర్చియుంటిని.

మణి : అమ్మా! చాల గట్టిదానవే! సరే! నీవు రాగలవుగాని నేను నిన్ను గొంపోవుచున్నఁ దోడిసిద్ధు లేమనుకొందురో యెఱుఁగుదువా? లోకమునోరుమూయ మూతలున్నవా?

కల : నిర్జితేంద్రియుల నెవ్వరు శంకింతురు? శంకించినను వారి పాపమున వారేపోదురు. తమకేమి? నాకేమి? ఒకసారి

నారదభగవాను లనుచుండ వింటిని. సన్న్యాసుల పుణ్యపాక
ముల లోకమునారు పంచుకొందురంట.

మణి : లోకులమాట యట్లుండు. మీబోంట్ల సంస్పర్శమాత్ర
ము నస్మదాదులకు సమ్మతింప నుచితంబకే!

కల : దేవరవారేల యిట్లు తలంపవలయు? నిష్పాపసుం జెదలం
టునా?

మణి : అంతపనులకపోనేల? సన్న్యాసత్రయు లిల్లుగదలనిత్తురా?

కల : స్వామీ! కాలయాపనమేల సేసెదరు! సన్న్యాసత్వము గన
కుండ జేసినను నెగిరిపోదము.

అని పాదాలపైబడి లేవకున్న కలభాషిణిని సరే కానిమ్మని
లేవదీసి మణిస్తంభుడు సిగ్గువలన కొంచెపడ్డదని సంతసించె. తా
నేమి తలచుచుండెనో? తానొకటి తలచిన దైవమొకటి
తలచుచుండును.

పిమ్మట మణిస్తంభుడు పులితోలు పల్లకముగాను, బెనుం
బాము దంగువాలుగాను, రసవాదమువలన సిద్ధమై బంగార
పుంకవన్నెలుగాను, సంకులు మడదండలుగాను, వశ్యౌషధపుం
దీగ కళ్లెపు పగ్గములుగాను, గలిగిన సింహవాహనమును జేరి
యొక ప్రక్క నిలువంగా బంటియోలు టాటలోంగలక త్తి నుండం
జూచుకొని దివ్యాలయపు గద్దెపైనెక్కి కూర్చుండి "యబలా!
నన్నంటి దాంకగ వెనుకగా దీనినెక్కి మరగొమ్ము నేమరక పట్టు
కొని రాంగలిగిన రమ్ము. నాపుడు వారకాంత యింతమాత్రము

మీ యనుగ్రహమున్న నింకఁ గొండలు దాటుట కేమి? యని ముంగురుల సరిదిద్దుకొని జడచుట్టగా సవరించుకొని కుచ్చెళ్లు వెనుకకుం జెక్కుకొని పైఁటకొంగు సరిచేసికొని సారసనము బలె బిగించుకొని ఛంగున నవ్వాహనముపై నెక్కి కూర్చుండి 'జీవా! యెవ్వరు నెఱుంగకుండ నెట్లు కొనిపోయెదో? నగలు సూచినఁ బనిభంగమగును. అన వాఁడౌశఁకఁ బెట్లుకొనుచుం ఎద్దులుబండియు నేకమైనచోఁ గొండమీఁదికి నఁ బోవుం జుమా' యని 'ఛేఁ' యని సింగము నదలించి పదిలముసుమా! పదిలముసుమా! యని మాటిమాటికి నెచ్చరించుచు వెనుక ముందులు చూచుకొనుచు మదురుగోడమీఁది చెట్లు నానల మున్నత వృక్షశాఖలు నాపై గృహధూమ రేఖలు చాటగునట్లుగా మింటి కెగిరి చనియె.

## 9. మజిలీ

మణిస్తంభుఁ డట్లు కలభాషిణిం దోడ్కొని మబ్బులలోఁ బోవుచుండ నంగనలు కొందఱు మెఱుపుఁదీఁగల వెన్నైరి.

సిద్ధుఁడు కలభాషిణిని మృగేంద్ర వాహనాల యానమునకుఁ జేర్చుట

మాటలఁ బట్టి వారు రంభాసఖులని యెఱింగి సిగ్గుం జిదియేమి మగువలారా! నెచ్చెలిని విడిచి వచ్చితిరి. ఆమె మణికంధరుని మీఁది యనుగ్రహంబున వదలక యింకను గొన్నినాళ్ళు తద్వనంబుననే నిలుచునా! యన వారు నవ్వుచు నింక నెక్కడి మణికంధరుండు? వాఁ డెక్కడఁ బోయెనో యెఱుంగము. రంభ యిప్పుడు నలకూబరునితోఁ

గలిసి పొదలుచున్నది. ఆమె సుఖమునేల భంగముచేయవలయునని యీమె నచటన విడిచి యరుగుచున్నాము. అని పలికి చనుచు నీ చింపిరిగడ్డము నీ పసిలోళ్ళు నీ రాగి బొచ్చు నీ గోసాయి యెక్కడ! ప్రవత విటులనైన గుత్తగొనఁజాలు నీ గుబ్బలాడి యెక్కడ? వీఁడెవఁడో వశ్యౌషధములుగల సిద్ధుని వలెనున్నాఁడు. కానిచో సుందరి నొకతెం గొంపోగలుగుటయు సింగము నొకసమునఁ బర్వర్తించుటయు నెట్లు? అని చెప్పుకొనుచుఁ గిలకిల నవ్వుకొనుచు నా యుచ్చరలరిగిరి.

అంత సిద్ధుండొకపరి వెనుకకుఁదిరిగి చిన్నవోయి చెన్నుదరిగియున్న యక్కన్నియ నెమ్మొగముం బరికించి 'అద్దిరా! నలకూబరుండు రంభం గలసి యున్నాఁడన్న వార్త దీనిం గలంచెరా!. యని తలంచి 'ఓ చంచలాక్షీ! యేల విచారించెదవు. ధైర్య మవలంబింపుము. ఒకింతసేపు లోనన నీవిచారము సర్వముం బుచ్చివైచెదను. నమ్ముము నామాట" యన గలభాషిణి 'దేవర వారంత నమ్మకముగా జెప్పుటకుం గారణమడుగవచ్చునా?' యన నతఁడు త్వరపడకుము. తినఁబోవుచు నూరలరుచి యడుగనేల? యనుచుండగనే సింగమ్మ మొగమ్మొగనెత్తి నుండు కడుగిడదయ్యెను. సిద్ధుఁడిదియేమి? ఎల్లడల సమంతితగతియగు నిది నిలిచిపోయినది. అని ఖేదమని యటిచియు, మడమలు తాటించియు, ముందటికి లివమాపియు, బదనవుఁ దీగెంకొఁ గొట్టియు, మొగము ప్రక్కకుఁ ద్రిప్పకుండ వాకట్టు మూలికవాగెను జక్కంబట్టియుఁ, బైకొఁగరకుండ నాగబెత్తమున నడినెత్తి మొత్తియు, నెంత తంటాలుపడినను

సింహవాహనము తోక త్రిప్పుచు గర్జించుచు వెనుక వెనుకకుఁ
ద్రొక్కుటపడుంగాని ముందుకు సాగదయ్యె.

అట్టియెడఁ గలభాషిణి మేను సెమర్పఁగా గుండెలు తటతట
గొట్టుకొన నట్టిట్టయి పడఁబోయి మరగొమ్మ రెండుచేతులం
గట్టిగఁబట్టుకొని యిదేమిదే మన నలెండు వెలవకు వెలవకు.
పల్లవు మరగొమ్మమఱుకు మని యటు నటు చూచి
ఓహో! మాటల వరాకుచే మర్యాదను పాటింపనైతిని.
అనుచు సింగమును వెనుకకుం గొన్న యూహఁగలు రాసిచ్చి
పదపడి పుడమికి మెల్లగఁ దొలుకొనివచ్చి యచట వాహ
నమునుండి దానిం దిగుమని యది దిగఁ సిదపఁ దానుందిగి
వాహనము మేను స్పృశించి యొయ్యనఁదట్టి దానిని మేఁతకు
విడిచి పడఁతీ! మృగేంద్రవాహన యనెడు దేవ్యాలయమిది.
దాని ముందఱ నాతల్లి వాహనముగలదు. అది మహాభయం
కరమైన మృగేంద్రము. దాని క్రిందను మీఁదను బుట్టుచున్న
నెట్టి బెట్టిదంపు సింగంబైనం జన వెఱచు. అందువలన నిది
ముందు కరుగలేదు. మన మిమ్మహాశక్తికి నభివందనము సేసి
పోయినం గార్యసిద్ధియగు. రమ్మనుచు మెల్లగాఁ దన నాడువము
ప్రక్కన వ్రేలాడు ఖడ్గగర్భంబగు భల్లూకచర్మకోశముఁ గేల
నందుకొని జీను నచ్చటన యొక మఱుంగున దాఁచి సిద్ధుండా
పువ్వారుఁబోణిని మృగేంద్రవాహన గుడికిం దోడ్కొని చని
వెలుపలి మండపమున నామెను నిలిపి దేవీపూజకుం బువ్వులు
గోసి తెచ్చెద. నీ వుండుమని వాఁడు పూఁదోఁట కరిగె. కల
భాషిణియుందు కూర్చుండెను.

త్రైలోక్యగురుఁడు నారదమహాని ప్రియశిష్య
నిర్విశేషముగ మన్నింప నలరి
జగదీశు ప్రాణనివాసపు సతులచే శిక్షగా
వింపంగ సంగీతవిద్య నేర్చి

గీ॥ దుడుకొకానొక కపటసిద్ధుండు డాసచర్చ
శక్తిపూజకుఁ బశువైతిఁ జర్చసేయ
నెంతవారికిఁ దప్పింప నెట్లువచ్చు
బ్రహ్మదాయమున్న వ్రాసిన వ్రాఁతఫలము.

ప్రజలందఱి కష్టములఁబోఁగొట్టు శ్రీకృష్ణభగవాను పట్టణములోఁ బుట్టిపెరిగితి. మూఁడులోకముల గురువైన నారదమహర్షీంద్రులవారి ప్రియశిష్యురాలనై యలరితిని. లోకేశ్వరుని ప్రాణప్రియలకడ సంగీతమభ్యసించితిని. నేర్పరినై సభ్యులచే గౌరవములందుచు బ్రదికితిని. ఇట్టి నేను దుడుకొక కపటసిద్ధుని చేతికి దొరకి బలిపశువునైతింగదా. కటకటా! ఎంతవారికిని నుదుటివ్రాత తప్పదుగదా.

అయ్యయ్యో! చలికత్తియల మొఱంగివచ్చుట యసురు దొఱంగుటకా? బాపురే! తలఁచుచోటికిఁ గాళ్ళిడ్చుకొని పోవును. అని కొంతసేపు నగచి యవ్వల యయ్యవ్వతో "నవ్వా! అయిన నిపుడు కర్తవ్యంబేమి? తప్పించుకొన వెరవు గలదే? పాఱిపోయెదనన్న నెచటికేఁగఁగలను. ఎచట డాగగలను? వీని దూరదృష్టి నన్ను బ్రదుకనిచ్చునా?

ముసలిది "బిడ్డా! వీని దూరదృష్టిని నీవును నెఱుంగుదువా?

కల : అయ్యో ! ఎటులంగ కేమి? అదిగదా నన్నింతవరకుం దెచ్చినది. అని తన వృత్తాంతము సర్వముం దెలిపి "అవ్వా నేను నలకూబరు నెనయవచ్చునని తలంచితి. వాఁడు శక్తికి బలి యీవచ్చునని తలంచెను. దయ్యము చెయ్యాలం దడవ నేరము.

మున : అమ్మా ! ఇతం డప్పుడప్పుడు దూరదృష్టి దూరశ్రవణ మహిమలు గల నాకు రాజ్యసంపదయు నున్న నెంత బాగుండునని ముచ్చట పడుచునుండును. అందుకు లోకోత్తర సౌందర్యము, ననుపమాన సంగీతముగల వార కాంత నొకదాని లభించునా ? యని నిరంతరము వాఁడు దూరదృష్టితో వెదకుచుండును.

కల : అమ్మా ! వీఁడిచటనే యీ రెండు శక్తుల సాధించినాఁడా? అక్కటా ! వీనికై యెందఱొ గొంతులు గోసినాఁడో కదా ! అవ్వ ! నాకుఁగల మేలుగీత్పు కాకమానదు వాఁడు వచ్చు నెలవిని నన్నేమి చేయునో ? ఎట్లు చంపునో ? అయ్యో ! చప్పుడుగాఁ బోలునని విచారించుచు భయపడు చుండ నేల ? కొంత యుక్తిసం గాలయాపన మగును. ఆ విచార మీ కొంచెము సేప్పిన లేకుండును. పిదప నాతల్లి యీజగదంబ, లోకేశ్వరి, యాదిశక్తి, దయాస్వరూపిణి, మృగేంద్ర వాహన యెట్లు సేసిన నట్లు సేయుఁగాక, యనుభావ్య మను భవింపక యెట్లు తీఱును!

మున : భళి భళి ! ఎంత ధైర్యము. ఎంత వివేకము. ఉత్తమ స్త్రీ రత్నమవు తల్లీ. నీవు అడిగితివి కానఁ జెప్పెద. విను. అతని

కాశక్తులు పరహింసచే వచ్చినవికావు. స్వహింసచేతనే. ఆ వివర మించటనున్నది. చూపెదరమ్మా.

అని యా వృద్ధాంగన సముత్సాహంబునం గల భామినిం గొంపోయి తన్మందిరాగ్రభాగంబున

**మృగేంద్ర వాహనా ప్రభావములు**

మృగేంద్ర వాహనంబు దండంగల శిలాస్తంభంబునుం జూపి దానిం దగ్గఱి యాశిలాక్షురపంక్తిని, నందు వ్రేలంగట్టిన యా శస్త్రయుగ్మంబును, మఱియు నచ్చట గంధపుష్పాద్యర్చితంబులై యున్న యొక్క సురియను గండకత్తెరంజూపి బాలికా! నీకా లిపి తెలిసినం జదువుకొమ్మా. అందీ యా కోరికల కిట్టిట్లు చేయవలయునని కలదనం గలభామిని వేడ్కతో నయ్యక్షరములు స్పష్టంబుగా నక్కం బఱపి యిమ్మాడ్కిం జదివె.

1. ఇచట రెండేండ్లు జితేంద్రియుండై భువనేశ్వరీమంత్రమును జపింప నిద్దేవి యెల్లకోర్కెల నిచ్చు.
2. ఈ గోరుగంటం గనులు పెరికి దేవికిచ్చిన వానికి వెంటనే దూరదృష్టి సిద్ధించును.
3. ఈ నారసములం జెవిం గ్రుచ్చుకొన్న వానికి వెంటనే దూర శ్రవణము లభించును.
4. ఈ సురియచే నాలుకం గోసికొన్న వానికి వెంటనే సారస్వత ప్రౌఢి లభించును.
5. ఈ గండకత్తెరచే మిడిదలయిచ్చు సాహసికుండు మరల వెంటనే యాతల యదుకుకొనంగా బ్రదికి తన్నుం జంప వచ్చిన వానిం జంపు.

6. అనుపమ రూపగానములు గల వారకాంతం బలి యిచ్చిన వానికి నిష్కంటకమైన మహారాజ్యలక్ష్మి చేపడును.

అని చదివి వేశ్యాంగన నేనంతగా సంగీతము నేర్చికొన్నది యీ యోగ్యతను సంపాదించుటకా? యని తలపోయు చుండ నవ్వ సువ్వాంజనమున నేమియున్న దని యిట్లు చదివె.

7. ఈ పసులేనివాఱుం జేయులేని వృషలిచట నిర్భయముగా నెట్లు శరీరమునుం బాసినను వారికి వెంటనే యామానరూప సిద్ధియగును.

శరీరమోక్షవేళ వారికింగల యీప్సితము తప్పాదిగా సంఘటిల్లును. అని చదువ విని ముసలియవ్వ చేసఱచినప్పుడు నిందు కనియే నేనిచట మృతికై యెదురుచూచుచుంటిని. తెలిపినదా? నన్ను సుముఖముస తిరుండుదును. కాశ్మీరదేశమున శారదాపీఠమందు సరస్వతింగొల్చి పూజరిపట్టిని. అని పలుకుచుండ సిద్ధుండు దృగ్గోచరుండయ్యె.

మణిస్తంభుండు కలభాషిణిం జూచి పృచ్ఛించుట

మణిస్తంభుండు దేవిపూజకు గంధమాల్యాది వస్తువులు సంపాదించుకొనివచ్చి ముసలిని గని కుశలమా? చాలకాలమునుండి యిచటనే వసించుచున్నదానవు. అని కలభాషిణింగని రమ్మీ. మురలి మనము వేగిరము చన వలయుంగదా. ప్రొద్దు పోవుచున్నది. దేవిం బూజించి పోదము. అవ్వతోం జెప్పి రమ్మనన నది 'అన్నా! ఏనొంటిరిగా లోనికిం బోవ వెఱచుచుంటిని. నీవును దోడు రమ్మని వారాంగన పలుక

## 11 మజిలీ

కలభాషిణిం గొన్ని దినంబులకు మృగేంద్రవాహనాలయం బున కేగుదెంచి యచ్చట నున్న చంచలాక్షి నిరీక్షించి యువతీ! నీ వెందుండి వచ్చితివి? నీ కథ యెయ్యది! యని యడుగుటయు పుత్తగుణి నన్నో 'నేను మును నీకు అడ్డపడి సిద్ధునిచేత ఖండితయైన సుముఖాసత్తియను వృద్ధాంగ నంజుమీ. ఈ మహాదేవి కరుణాకటాక్షంబున నిట్టి యెల ప్రాయంపు సొంపు వహించితి. శిలాస్తంభ లిఖితాక్షరపంక్తిని జదివి యుంటివిగదే' యనిన నవ్వాల నో కలభాషిణీ! మహా దేవివలన విసరివేయంబడి సిద్ధునితోఁ గి వెచటం బడితివి? ఎట్లు బ్రదికితివి? సిద్ధుం డెట్లు విడిచిపెట్టె? నీ విచటికి గ్రమ్మర నెందుకు వచ్చితివి? నీవు తిరిగి వచ్చుట యద్భుతంబుగా నున్న దనఁ గలభాషిణి యిట్లనియె.

కలభాషిణీ సుముఖాసత్తుల సంభాషణము

ఓయమ్మా! చచ్చిన నీవు యువతిత్వంబున బ్రదుకుట యద్భుతంబుగాక యింతటి మహాపుణ్యనిధివైన నీ దర్శనంబు గలుగనే నొవ్వక తిరిగి వచ్చుట యేమి యద్భుతంబు? నావిధం బంతయు విన్నవించెద వినుమనుచు నాఁడు మణికంధరుండు వీణాసహితుండై గంభీరమానంబున నొప్పించె.

వచ్చుట తోడనే వారవనిత యచ్చెరువడి బ్రమొక్కు నతం డును విస్ఫారితనయనుండై, ఓహోహో! మా బంధువ్యాపారంబులయును వచ్చి యున్నట్లు నాహృదయం బాహ్లాదిన

కలభాషిణీ మణికంధరుల సంభాషణము

వుగాఁ దన్నుఁజంపఁదివురుటయు, నపుడు సుముఖాసత్తి తన్ను రక్షించుటయుం జెప్పి యాతల్లి యీ పుణ్యసాధ్వియే యని యమ్మకుం బరయానంజూపి తత్కులస్థాన వర్తనంబులు దెలిపి "ఓ గంధర్వోత్తమా ! ఇంక నాకు నీ చందంబు వినవలయు. అవ్వేళంబున రంభ చేత నీ తనంబు విఘ్నంబు నొందుట యామణి సంభుని చేత నేను విన్న ప్రకారంబు నిజంబుగదా. యటమీఁదటి భవదీయ వృత్తాంతం బెఱింగింపుము.

మణిస్తంభుని రాక

అని కలభాషిణి పలుకుచుండఁగనే మణిస్తంభుఁడు చేర వచ్చె. వారాంగన వానింజూపి యిప్పుడే చెప్పిన సిద్ధుండితండే! యన గంధర్వుండు నూఁది యితండా! యని ముసి ముసి నవ్వులతో నానిందగు తెఱంగున సంభాషించె.

అంత సిద్ధపుంగవుం డచ్చటి వారల నెల్లఁ గలయఁజూచి యిది మహాశ్చర్యము. మీ రెచ్చోటనుండి వచ్చితిరి. ఓ కలభాషిణీ! నిన్నెల్లచో వెదకితిని. ఎందుంగానక చోద్యమందితి. అప్పుడెక్కడికేగితివి? యిప్పుడిక్కడికెట్లు వచ్చితివి? యని సుముఖాసత్తిఁజూచి నీ పేరేది? ఎచ్చటనుండి యిచ్చటికి వచ్చితివని ప్రశ్నించె? రూపు మారిన పిదప మాకు గ్రహింపవలేదు. ఎవ్వరు మారిన గ్రహింపఁగలరే? యనిన సుముఖాసత్తి యిట్లనె. ఇది యంతయు దేవీమహిమ నీకిది చెప్పితిని. చచ్చి యమ్మహాశక్తి ప్రసాదంబున యువతినైతిని అని తన వృత్తాంతము దెలిపి వారల కాశ్చర్యముం గలిగించె.

రూపమును జూతుఁగదా. సిగ్గులేటు. నా హృదయమందలి క్రోధ స్థానమునఁ గామము పొడసూపె. ఇంతీ! చేసినపాపము చెప్పినఁ బోవునండ్రు. నేను వెంటనే దానిని గాఢముగాఁ గౌఁగిలించితి. అది దానిని సైరింపక కుయ్యో! మొర్రో యని బిగ్గరగా నఱచుచు దిక్కులేని దానను. నన్నీ పాపాత్ముండు బలాత్కరించుచుండె. రారే! చూడరే! రక్షింపరే! సత్పురుషులింకను లేరే! ఆపదవారింపరే! శరణు శరణు. అని కలభాషిణి మొఱలిడ సాఁగె.

నలకూబరుఁడు కలభాషిణి రక్షణార్థము వచ్చుట

ఆ మొఱలాలకించి వెలువడి వెలుపల మిద్దె నేను బయలికి వచ్చుచున్నాఁడ నెవ్వఁడురా యా దురాత్ముఁడు? ఒక్క గ్రుద్దుననే దలఁ దాటించెదనని దుర్లఁ జేసెద నన్న మాటలు వినవచ్చె నేను బదికింపోఁగదా యాతని పొదరిల్లు వెలువడి రయంబున నలకూబరుండు సద్యోభుజము వచ్చుచుండె. వానిం జూచి నేను భయపడి పాఱఁ జొచ్చితి.

వాఁడును క్రోధావేశుండై వెంటంబడి కొంత దవ్వు చన్న నన్నుఁ గూడ ముట్టిపట్టుకొని ఓరీ! యెవ్వఁడవురా నీవు? ఇంతయుఁ బాపదవురా? స్త్రీని బలాత్కరించెదవా? నీకుండ నా దండనీయుఁడవుగదా! రారా! పాపీ! యీ కాంతం జూపుమాపై నిన్ను భరతము పట్టించెదనని నన్ను వెనుక కీడ్చుకొని వచ్చుచుండె.

అని మణిస్తంభుండు చెప్పుచుండ వినుచున్నవారలలో మణికంధరుండు నవ్వి పాపము సిద్ధునియొక్క కోరికయు సిద్ధింపదాయె

# 13 మజిలీ

ఇద్దఱు రంభల కలహము

ఈ విచిత్రము వినుండు. పొదరింట రంభానలకూబరులు స్వేచ్ఛావిహారములం గ్రీడించుచు నొండొరుల ముంగురులు చక్కదిద్దుకొనుచు ముచ్చటలాడుకొనుచుం బ్రొద్దుపుచ్చుచుండ నయ్యానుగు జాడలంబట్టి యింకొకరంభ యప్పొదరిల్లుడాసె. వారు వెలిగందిరి. నేనును నచ్చెరువందితిని.

యువరాజపుత్రుండా వచ్చిన ద్వితీయ రంభను దన యొడిలోఁగల ప్రథమరంభను గొంతసేపు క్రమ్మఱి క్రమ్మఱి చూచె. ఎందు నట్టి భేదముం గన్పింపదాయె. వాఁడు నత్యంత విస్మయ స్వాంతుండయ్యె. అపుడు

ప్రథమరంభ : ప్రాణప్రియా ! ఏమిది యట్లు తిరిగి తిరిగి చూచెదవు ?

నలకూబరుండు : ప్రియురాలా ! నీప్రతిబింబమిదియో ? దాని ప్రతిబింబమునీవో ? తెలియక చూచుచుంటిని. ఇద్దరు నొకేయచ్చున గ్రుద్దినట్లున్నారు. ముక్కులు మొగములు కన్నులు కరములు పాదములు శరీరకాంతియు సరే, చివరకుం గట్టుకొనియుండు కుచ్చెళ్ళుం గంచుకమును వానిగీతలు నంచులు నొకండేమి? యెందు నే విభేదమైనవానియుం గన్పడదాయె. కంఠస్వరమైనను చూపులైనను చేతలైనను మాటలైనను భిన్నముగా నుండవాయె. ఈ సృష్టివైచిత్ర్య

మే మందును. కలికీ! నీవు నాదండనుండి తొలఁగిన మీ యిర్వురలో నిన్ను గుర్తించుట మిక్కిలి దుర్లభముసుమీ.

ప్రథ: ఉత్తమ ప్రాణనాయకా! నీ కౌఁగిలింపవలయు నెట్టను. ఎవ తెయో మనకు భేదము కల్పింప వచ్చినది. తొల్లియు నొక యసురజంత సీతారాముల నడుఁ బావ వచ్చినవని విందుము. కాన దీని నీచుట్టు పట్టుల నుండనీరాదు. నట్టి మొగమోటు చాలించి దీనినగలించి పంపివేయుము.

అని పౌరల నయ్యో! వలదు వలదు. నీపిటనుండి లేవ వలదు. అని కాంతు కంఠము నొక కేలఁ గౌఁగిలించె.

క్రొత్తగ వచ్చిన రెండవరంభయు నిదియుఁగాయు విని చూఁ గనుచు ముక్కుపై వ్రేలుంచుకొని తల గదల్చుచు నుత్తల పాటుతో నుస్సురు మనియె. అప్పుడు ధనపతి ప్రియనందనుండు

ఓ పడఁతీ! నీ వెక్కడనుండి వచ్చితివి? ఏల యున్నావు మంటివి? నీ కెందు కాశ్చర్యము కలిగినది? మనంగన రూపము నీ వేల ధరించితివి? నీ వెవతెవు? రాకాసివా? పిశాచివా?

రెండవరంభ: నే నేమనుటకు నానోరు వచ్చుటలేదు. బింబ ప్రతి బింబములం దెల్పు నుపాయము నాకు గానఁ బడునందాక మీ రేమనినం జెల్లును, రాకాసివన్నను బిశాచివన్నను నౌనననలెంగాని కానని యన్నలాభమేమి? ఇది యెచ్చటనో రూపము దాల్చి వచ్చి నన్నంటు కొన్నది. తనసత్యము లోక మొకింగినపుడు గదా రాకాసి యెవరో? పిశాచియెవరో? తేలునది. తొందరపడకుము.

తేలక తప్పదు. సత్యము దైవము లేకున్న జగము నడచునా? ఓ వల్లభా! దైవ మన నాకు వేఱె యొక్కఁడున్నాఁడా? నీవే దైవము. నీవే తథ్యమిథ్యాస్వరూపముల నేర్పాటు చేయఁగలవు.

అల్లప్పుడొకచోట సురపొన్న నీడ మనము కలిసియుండఁ బడమటిదెసగా నొక యార్తధ్వని విన్పింప డిగ్గన లేచి నీవద్దెవఁడుం బర్వెడ లేదా? అపుడు నేనును నీవెంటనే యేతెంచుచుండ నొకయిట్టిడాపలివంక నేగినది. అని చూచి శంకించి యించుక తడ వాగితిని. అంతలోనే యిది యెచ్చటనుండివచ్చి పడెనదో? నన్ను లంకించుకొన్నది. ఇప్పుడైనం గల్లనిజము తెలియఁగును.

అనఁ బ్రథమరంభ నలకూబరు మొగంబునన చూడ్కి నిలిపి యొక కేల నతని కంఠంబుఁ గౌఁగిలించుకొని మందహాసముతో “నాథా! వేల్పులసాని చెప్పినట్లు మన చరిత్రమంతయు నిది చెప్పినది. ఎచ్చటినుండి చూచుచున్నదో? ఔరౌరా! సురపొన్నక్రింద నున్నదియు వెంటవచ్చినదియుఁ దానఁట. ఎంతసందుచూచి యతికినది. వహావ్వా! యిది దయ్యముగాని తొయ్యలి గాదురా! ప్రియుఁడా! ఇది నారూపుదాల్చి నన్నుఁ బాయఁజేసి తా నిన్నుఁ గులుకఁజూచుచున్నది. దానికిందగినట్లే మాయలాఁడి మాటల నేర్చెనేదా? వల్లభా! యిది కన్నుండగను పాపని పిల్లు నేర్పుగల గడిదొంగ. ఇఁక నిట నుండరాదు. అవ్వల నొకటి పుట్టిన దిద్దుకొనుట కష్టము. లెమ్ము. చనుదము.

అన రెండవరంభ యుల్కగదిరి దాని నధిక్షేపించుచు నిట్లనియె.

"నిలు నిలుము. వేలయింత తొట్రుపాటు? ఇల్లలికినంతనే పండుగయ్యెనే? ఈకొంచెము సేపులోనే నీవు వచ్చిన ఇల్లాల వైతివా? నేను పెర నైతినా? మగండా! నీతో నాతల తెగ నఱికిన నఱికెదంగాక. నా పెనిమిటి పంటను నీకా? గాదిని నా చక్కదనాలకుప్పను తెకతేరగ నీకెగనిచ్చి పోదునటే! నా ప్రియుని మెడను నీ వెనతవే కౌగిలించుకొనుటకు? రావే యీవలకు రావే.

ప్రథ: ఈ పిచ్చి కబుర్లిచటం జెల్లునా. దొంగలాన వాడిచినం గోకలు విడుతురా? గతిమాలిన పిశాచి! నీ మాటల నేను గణింతునటే. పో-పో

ద్వితి: అంత మదము కూడదే

ప్రథ: అంత మదము కూడదే.

ద్వి: నీ గంతు లడంచెదనులే.

ప్ర: నీ గంతు లడంచెదనులే.

ద్వి: ఒకని మగని కాసింప వచ్చినావటే

ప్ర: ఒకని మగని కాసింప వచ్చినావటే.

ద్వి: నిజము దాగునటే

ప్ర: నిజము దాగునటే.

ద్వి: ఛీ! పోవే.

ప్ర: ఛీ! పోవే.

ద్వి: సిగ్గు లేదటే:

ప్ర: సిగ్గు లేదటే.

ద్వి॥ నోరుమూయవే

ప్ర॥ నోరుమూయవే.

అని ప్రథమరంభను ప్రియుఁడు వారించుచున్నను వినక అన్న మాటయే యనుచుండె.

ఇట్లిరువురు రంభలు నెసరేగి కలహించుచుండునట్టి యెడ

నారదుని రాక

నేపథ్యమున నుండియో యట్టి పడ్డట్లు తందనాల జడ దారిసుంచె ద్రిప్పుచు వీణె మీటుచుఁ గనువునిండఁ గలహ పారణ సేయుచువచ్చెను.

వచ్చిన కలహభోజనున కందఱు నెదురేగి మ్రొక్కిరి. అప్పుడతఁడు మౌని నవ్వుచు నలకూబరా! నీకిందే చెలువ ప్రియురాలు? అది చెప్పుము. అది తెలియక పరస్పర ప్రేమములు వర్ధిల్ల వలదుఁడనుచు దీపింపరాగు. అది యట్లుండ నీ వెంతటి టక్కరివయ్యా! రంభ సౌందర్యమున మోసపడ నట్టిదాని నే నాఁడో దానిం గల్పించి పోషించుచుంటివా? లేక రంభయే నీతోడఁ గ్రీడింప నొక్క మేను చాలదని ద్వైరూప్యముగా దాల్చెనా! ఇది యెట్లైన నగుఁగాక నీ ప్రేమ యీయిరువుర యందు సమముగనా? కాదా? చెప్పుము. ఎంతయో నేఁటి నుండి యిరువురిలోఁ గయ్యము పెట్టి చూచుచుంటివి. నేనును గగనమున వేడుక చూచుచు నుంటిని.

అన నప్పుడా నలకూబరుఁడయ్యా! మౌనినాథా! నేనొక్కఁడ వీరిం బోషించితిని. వీరిరువురు సమరూపతయుఁ బోరును నాకాశ్చర్యము కల్గించుచున్నది. అని పలికి తానొక్క రంభతోఁ గూడి యుండ

వనితా క్రందన ధ్వని వినంబడుటయు వెంటనే తానద్దాని కరుగుటయు, నప్పుడు పలాయమానుండగు నన్నుం నతివిని పట్టుకొని తిరుగఁ దెచ్చుటయు నక్కడికిఁ దనకొంత కూడవచ్చుటయు దామిర్వురుఁ గలిసియుండ ద్వితీయరంభ నచ్చుటయుఁ గలహించుటయుఁ జెప్పి వాఁడు వెండియు నిట్లనె.

అయ్యా! ఈయిద్దఱు రంభలయందు నేదిద్దిన కస్తూరికా తిలకము కలదు. కీల్గంటులందు నేఁజెరివిన కన్నెగేదఁగిఱేకులు గలవు. మెడయందు నే నుంచిన కురువెందవిరి గుబ్బసరములు గలవు. మానితిలకా! తమకడఁ దాఁపఱికమేల? చివరకు గోటినొక్కులుఁ పంటిగంటులు నిర్వురయందును గలవు. అయ్యా! నేనిద్దానితోడనుండ నదిపైగా వచ్చినదని రెండవ రంభ నమ్మునికిం జూపె.

అపుడు రెండవరంభ నారదునికంజలిసేసి " ఓ యమోఘ వచనా! యలనాఁడు ద్వారకచెంతఁ దామన్నపలుకింత సేసె. ననఁ బ్రథమరంభయు నట్లయన నారదమునివర్యుఁడు నవ్వుచు మీ యిర్వురన్నదియు యథార్థమయని పలికి యీమాటలు సరిదాఁకెఁగదా, మాకుఁ గన్నులపండువు గల్గె. కనువు నిండి నది. సుందరులారా! పోయివచ్చెదనన నలకూబరుండు చేతులు జోడించి యిట్లనియె.

స్వామీ! దేవరవారిద్దఱు పలికినదియు యథార్థము యంటిరి. ఇది యెట్లు? వినవలయుం దేటపరచి విచ్చేయుఁడన ముని యిట్లనియె.

ఇందొకతె నాఁడు తన సౌందర్యమున శరవతి ముద్దుకు మారుఁడె సాక్షియన నేనా గర్వోక్తులు వినలేక నీకు సవతి కల్గఁగూడదా ? యంటి. ఆమాటం దలంచి యది యీపలు కింత సేసెనని తార్కాణసేసె. కాన నది యథార్థము.

మఱొకతె రంభారూపముఁ బ్రియుంగూర్కఁ గాంక్షించి యొక కార్యావసరముగా నాచే నవ్వర మనిపించికొనియె. అమ్మాటల మదినిల్పి యది యప్పలుకింత సేసెనని. ఇదియు యథార్థము.

అన నప్పురుషుండీ భామభావమిది. యీభామభావమిది యని తథ్యమిథ్యాభావము లేర్పఱుపనయ్యునన నవ్వి యప్పరమబ్రహ్మణ్యుండు తథ్యమిథ్యాభావముల కేమి ? నీకుమాత్రి మీభావమా మాకారము స్వాభావికమా ? సృష్టియంతయు మిథ్యయే. ప్రపంచమున నిజమెద్ది ? అదియుంగాక నొకటి చెప్పెద వినుము. ఒకదానింజూపి యొకదాని గర్వమడంచుచు స్వేచ్ఛగా నభిలాషం దీర్చికొనుము. నీపుణ్యము సమమడించి నేఁడు ఫలించినది.

అన నతండు మహాత్మా! పెద్దలఁ దడవు నిలుపరాదు. వారిట్టిట్టు పలికిన మఱేమివచ్చునో ? యన వాచంయమి యల్లన నవ్వుచు నట్లయగుఁగాక యని యొందే నరిగె.

## 11 వ మజిలీ

అంతట నలకూబరుండు ప్రథమురంభ కేలుపట్టుకొని ఈ జగజంత మనకేళికి భంగము కల్గించినది. రమ్మని దానింగొని

సత్యరంభ బయల్పడుట

చనుచు రెండవరంభతో 'ఓసీ! నీవెంత నేర్పు చూపినను మాకు మాయగనే తోఁచుచున్నది. సత్యమెఱింగింప సాక్షిఁ దేమమ్మా. పోపోమ్మనఁ బ్రథమరంభయు నాచవఁవుంగొని 'ఛీ! ఛీ! సిగ్గులేదటే! ఇద్దరు వధూవరు లేకాంతమందుండ నేమని వచ్చితివే! యన ద్వితీయ రంభ యమ్మాట విని రోషావేశపూరిత వీక్షణంబులఁ జూచుచు నోసీ! టక్కులాఁడీ! ప్రతిజ్ఞపడకే. కుబేరుఁడు లేఁడా? సుత్రాముఁడు లేఁడా? కల్ల నిజములం దెలుప. ధర్మము నశించిన దనుకొంటివే అజ్జులాఁడీ!

ప్రథమరంభ : "అఱవ్వలుడిగి పో పో. నీ యాఱవేతలు బల్లు వచ్చినప్పుడు మమ్మాం గఱచెదవుగాక. తగునెడ తెలియుదు మదియెట్టిదో వములు విసియెసినా?"

రెండవరంభ : "కానిమ్మా. వేగిరింపకు. నీ గాటపు ప్రొద్దు పొడిచెనే? యేదైవం బైనను నిప్పు కప్పుచుండునే. నా నిజ మేర్పఱచి నీ కొసగ్బెద శిక్షల్."

అని యచ్చోటువాసి కొన్ని యడుగులేగి యంతటఁ దన కోపంబును మించి దీపించు ప్రియునితో గ శాపంబున కోపక యాపదఁ తీరుడుం గృశించి యీ ఘటన వినిపింపను సిద్ధంబు చెప్ప శ్రోతలు విస్మిత చిత్తులైరి. సత్యరంభ యేమనుచు నీతో నొకరు మాటలాడుకొనుచుండ విద్యుత్తునను దనసొగపు వారువంబు స్మృతిపథంబున నంబడఁ గని నాసిద్ధాంతంబుఁ జూపి వచ్చుట కరిగె. అచట ద్వితీయరంభ యిట్లు చింతించెను. "నారద

మాని ద్వారక చెంతగదా 'నాతో నిను బోలు వనిత నీకుం దటస్థించి కలంత పెట్టరాదా! ఎవ్వారికింగర్వము తగ' దన్నది. ఆయన యిప్పుడే కలభాషిణీ వనములో దిగినాడు కూడ. కనుక నిది యొక వేళ కలభాషిణి యేయై యుండవచ్చు. మఱియు నారదోక్తుల వలననే యిదినా రూపము నాల్చు శక్తిని బడసినదంట. కనుక నిది కలభాషిణియే. ఒకవేళ నదికాదా? మానవాంగనయగుట మాత్రము తప్పదు. మానవులకు గగన గమనశక్తి లేదు. కాన దీని దేవసభకు రమ్మని గుట్టుబయటం బెట్టెదంగాక యని యోచించె.

మణిస్తంభుడు తనవారువమును జూచికొని వచ్చుటతోడనే సుముఖాసక్తి యిట్లనియె. యోగిపుంగవా! కథనొద్దనంబడ వేయనైతివి. సత్యరంభను బయల్పఱుపుమన సిద్ధుండు మరల నిట్లనె.

అట్లు రెండవరంభ కొన్ని యడుగు లవ్వలవైచి యించుక యోచించి తిరిగి వారిచెంత కరుదెంచి ప్రథమరంభతో నిట్లనె. ఓ గయ్యాళీ! నీవు ప్రియుని యొడిలో ముద్దులు గులుకుచుం గడుపులో నీళ్ళు కదలకుండ నుండవలయునా? నేను గడప గడపత్రొక్కి వారి కాళ్ళు వీరి కాళ్ళు పట్టుకొన నేగవలయునా? చాలుంజాలు. నీ యోగమును నీవును రా పోదము దేవసభకు. అని డగ్గఱి ప్రథమరంభ కొంగుపట్టి లాగెను.

ప్రథమరంభ: నాథా! చూచితివా? ఈ పెనుదయ్యము దుండగము. నీవుంటివనియైన జంకక తెగబడ్డది. ఇది యెక్కడి

పంపకము ? ప్రియుడా ! నీవు మొదట నూరకున్నందువలననే యిది యింత లగ్గలకెక్కుచున్నది.

నల: ప్రియురాలా! మన కేమిభయము. పోదము పద దేవ సభకు. అచటనే దీనికి శిక్ష వేయుంతము. నిప్పునంటు కొన్నంగదా కాలునది.

ద్వితీయరంభ: ఔనురండు. పోదము. సత్య మెచటి కేగినను జెల్లుబడియగును. కదలుఁడు కదలుండనఁ జేయునది లేక యందఱు నడచుచుండిరి.

అపుడు నలకూబరునడుగు లేలోకో సాఁగుటలేదు. అది గని ప్రథమరంభయిట్లనె. నాథా! నీ సుకుమార శరీరము మార్గ శ్రమకు సహింపలేదు. అదిగాక నేనును నటుకువచ్చుట యుక్తముగాఁ గన్పించుటలేదు. ఏలయన ? అక్కటా నెమి దినములు వచ్చినవి.

సీ॥ అప్సరస్ స్త్రీలలో నగ్రగణ్యత్వంబు
జగదుపశ్లోకితంబుగ నహించి
ఊర్వశీ మేనకాద్యుత్తమాస్త్రీలు గా
వమ్మ పోవమ్మ నా నతిశయిల్లి
ఎన్నండు నెచ్చోట నే వారిచే వ్రేలఁ
జూపించుకోనక ప్రసూతికి నెక్కి
నలకూబరుండు ధన్యతరుండు నాగటు
వతనంబుచే నీకు వన్నె దెచ్చి

గీ॥ ఒవ్వనే యింకఁగటకటా! యిప్పకొచి
నాను సరిచేసికొని దేవలోకసభను
నీవునూ నీవు నుమ్మని యే విధమునఁ
గలహమూడెదనిది నీవె తలఁచిచూడు.

అప్సరసలలో నెల్ల నగ్రగణ్యురాలనై యుంటిని. ఊర్వశి మేనక మొదలగు నుత్తమ కాంతలచే మిక్కిలి గౌరవింపఁ బడుచునుంటిని. ఎవ్వరిచేతను నిదియిట్టిదని వ్రేలుపెట్టిచూపించు కొనక పేరుదెచ్చికొంటిని. నలకూబరుండు మిక్కిలి ధన్యుఁడనఁ దాని నీకుఁదెచ్చితిని. అట్టి నేనిప్పుడొక్క తొత్తుతో పాటి పెట్టుకొని దేవసభలో వాదాడుట యెంత నవ్వులాట పని. కోపము పాపమునకు హేతువండ్రు. ఈవాదు పోట్లాటకుం దగిన యేతిట్లాటలు ప్రాపించునో? ఛీ! ఛీ! మొగవాండ్రి యెదుట నట్లు వాదించి పదరిన యాడుదాని బ్రదుకు నొక బ్రదుకే! పేరుప్రతిష్ఠలు లేని యిది సహించిన సహించుంగాని రంభనొక ప్రతిరంభవచ్చి రచ్చలకీడ్చి తెచ్చెనంచు నిర్జరవిటులు నవ్వుచు హాస్యమాడుకొనుచుండ విని నేను సహింపలేనునాథా!

కం॥ నా నడకలకును యోగ్యము
కానిది యిపుడిచట నైన కలహము బ్రదుకే
లైనగుఁగాని యిఁక నీ
యాన ధరణివిడిచి దివికి నడుగిటువెట్టన్ ॥

ఇక్కడనైన వాక్కలహమప్పుడే దివంబునఁ బొక్కకుం డునా? ఇఁక సురల మొగము నేగతిఁ జూతును. ప్రాణనాథా!

ఇఁక నీచిత్తము నాభాగ్యము. ఎట్లైన నట్లగుఁగాక. ఏమిచేయు దును. దైవము కంటెకిం బెలగింజయుఁ బెద్దయ్యెనది.

ద్వితీయరంభ: వింటివే! వింటివే! ఈ టక్కులాడి సక్కుజత్తులు. వేల్పులకడకు నేతెంచినఁ దనమాటలు బట్టబయలగునని సుదిలమొగము నేగతిచూచునంచు వంకపెట్టి రానను చున్నది. ధరణివిడిచి దివికి నడుగు పెట్టదఁట. నీ యానయఁట. ఏమిమాటలు నేర్చినది! నాథా! యిందువలన దీనికి ఖేచరత్వంబు కలిమియు సంశయమున్నయని స్పష్టపడు చున్నది. ఇంతలిడవు ప్రియకాంతయని యెట్లు నమ్మి దీని నంటుకొంటివి. విడువు విడువుము. దీనిఁ దాకకు.

ప్రథమరంభ మెడ మొగము పెట్టి యేమియననిమ్ము. ఇంక నీకు నుత్తర మొసంగనని నలకూబరుంజూచి యిచ్చటనున్న ప్రథమరంభ సత్యరంభ కాదని యెంచి మాయాప్రయోగముచే యిట్లో నీకోర్కెఁ దీర్చుకొన్నదానవు. తొత్తుకూతురా! పో! యని మెడబట్టి దానినెట్టె.

ఆసందుగని ద్వితీయరంభ నన్నుఁ జేసిన బాస హేతి ఘాతంబులు పొంద నలఁబడితి గాన నీవును హేతిఘాతంబులను గాయముల యోగము నొందుమని శపించె.

ప్రథమరంభను ద్వితీయరంభ శపించుట

అట్టియెడ నలకూబరుఁడేమియు ననక యిందుమోము నెట్టెట్టి చూచి పిదపనోసీ! నీ పేరెయ్యది? యూరెయ్యది? యని యడుగుచుండఁ ద్వితీయరంభ చాలుఁజాలు. దీనితోడి ముచ్చట

ఇంకను మనసుకీలు లేదా? నాథా! నామనోభావ మీ వెఱుఁగవుగదా! ఇది యే మన మనకేమి? రా, నికుంజపుంజమున కరుగుదమనెను. అని సిద్ధుఁడు చెప్పి సుముఖాసత్తి నవ్వుచు మీరిందేది సత్యరంభయని గ్రహించితిరి? నేను గనుగొంటిని. ద్వితీయరంభయే సత్యరంభ. నలకూబరుని తెలిసి ముట్టిచ్చినది. యని యందఱు గొల్లున నవ్విరి. అప్పుడు సిద్ధుఁడు మీరు దీనికే నవ్వితిరి. ఇంతకంటెను నింకొక యద్భుతము కలదన సుముఖాసత్తి ఏది? ఏది? యది చెప్పుము. వినెద మనియె.

## 15 మజిలీ

ఆవల మణిస్తంభుండు సురల కిట్లు కథ సాగించెను.

ఇద్దఱు నలకూబరులు

అంతఁ బ్రథమరంభను దూరముగాఁ బుచ్చి ద్వితీయరంభ నలకూబరుం జూచి మగవారి ప్రేమ లిట్టివిగదా! నిన్నెట్లు నమ్మను. ప్రాణనాథా! కాదు కాదు! తప్పనాడితి. నిన్నె నెందుకేఁగా బోనియ్యవలయు? అందులకిన్ని పాట్లు పడితిని యేమైన నలకూబరుం డస్రువులం దుడుచుచు నాయెడఁ దప్పుగలదే? నీవ యని భ్రాంతి పడితిని. దీనిని నీమది నిల్పకుము. నిజమెఱుంగుటకు తోడనే దానిం బాయనే! రూపసాదృశ్య మింత సేసినది. రమ్మని దానిం బరిరంభాది సుఖంబులం దేల్చుచుండెను.

నలకూబరుండు రంభతోఁ గ్రీడించుచుఁ దొంటి పొదరింట నా ఖడ్గమును విడిచి యాకలహ సంరంభమున దానిని మఱచి

యీవలకు వచ్చెను. నేను దానిం దెచ్చికొన నీలుగునా ? యని యిపు డిటునటుఁ జూచుచుండగా మఱొక నలకూబరుండుద్భూతుఁడై యేతెంచుచుండెను. నేను బాపురే ప్రకృతి విచిత్రములని యబ్బురంపడి చిత్తరువు బొమ్మనైతిని. ఇంతలో నాద్వితీయ నలకూబరుం డెవఁడురా వాఁడు ? నారూపమ్ముం గైకొని నా రంభం జేరినాఁడు అనుచు మహోగ్రాకారంబుతో నతిరయం బున రంభానలకూబరులున్న చోటికిరాగా రంభ భయంపడి "ఇదియేమి నాథా! నాకడ కిండ్లు గట్టిక్కిఁ జననుకొనుచుండ మఱొకటి వచ్చిపడ్డది. తనరూపు నీవు దాల్చినాఁట. ఏమి యాత్రి! అక్కటా! ఏవాఁడు రాక్షసుండో చలపట్టి మాయలు పన్ని మనల వేధించుచున్నాఁడనుచుండ రెండవనలకూబరుం డిట్లనె.

అతివా! నీవు విభ్రాంతిం బలుకుచున్నదానవు. వీఁడు నా రూపు దాల్చిన మాయావి. నామాటలు నమ్మవేని నీవటు నిల్చి చూచుచుండుము. మదీయ నిష్ఠురనిశితకరవాలధారం వీని శిరంబు ఖండించి వైచెద. పిదప నిజం బెఱింగెదవుగాక " యన రంభ ప్రథమనలకూబరు కంఠంబుఁ గౌఁగిలించుకొని 'అయ్యో ఎవఁడో దుష్టరాక్షసుఁడు వచ్చి నాప్రాణకాంతు నిరాయుధుఁ గొంతుకోయ నుంకించుచున్నాఁడు. కావరారే యని బిగ్గరగా నేడవ నావచ్చినవాఁడు నవ్వి యిట్లనె.

'ఓసి తెలివితక్కువదానా! నన్నే రాక్షసుఁడనుచుంటివా? నీవు భయపడకు. నిరాయుధుఁ బట్టుఁ బోటుఁబోతు నేను జంపను. ఎదిరించి నిల్చునోయని వీనిం జంపెదనంటిని. కత్తి

దెచ్చుకొని కయ్యమునకుం గడంగుదుముమా. జయాపజయం బులు మనమనుకొన్నట్లు రావు. అప్పుడు నాగతి యేమి? యని యెంచుదువా? అట్లేని కయ్యమునకు సేగిరింప. నీవ మా యిరువుర వాక్యప్రకారంబులు వినియు నీవెఱింగిన పూర్వరహస్యంబు వడగియు మఱియు నుచితమగు సౌఱుంగులవలన మా కపటాకపట వర్తనంబులు తెలిసికొనుము. నాకుం బ్రియవనితవైన నీవు నాయెదుటన యిట్లు పరుని కంఠాలింగనం బొనర్చియుండ సహింపలేను. పెచ్చుపెరుగు మచ్చరంబున నేటుపోయి యేటు వచ్చునో? సత్యాసత్యంబు లెఱుంగబడునంతకు నాత్మహితంబుంగోరితేని యతని విడిచి యెడగలుగ నిలిచి నా పలుకులు వినుము.

అని నప్పటి కయ్యాదియు తెరువని రంభ వాని విడిచి యెడగా నిలిచి ప్రథమునే చూచుచుండె. ఆకారములు సమంబులైనను, నాదియుని తలంచినంగాని యనురాగ మొలకవదు.

అపుడు ప్రథమ నలకూబరుండు 'నాతీ! యేలయంత భీతి? వీని కత్తియుం గిత్తియు నన్నేమి చేయనోపు. వెనుకటి యలనాటి కోడి ప్రసంగంబువలననైన నన్ను విశ్వసింపలేవా? యన కెండనవాఁ డిట్లనియె.

కామినీ! యింద్ర దుండంపగదా నీవు మణికంధరు తపంబు చెఱువనచ్చితివి. అతనినే పట్టంగట్టితివి? ఇతనినొకని లంకించుకొంటివి. నే వెంటనున్నచో దపోభంగ మొనర్ప దొరకొనవు. అందువలన నింద్రుడు డలుగును. అనిగదా సుగకార్యవిఘ్న

ఎంతసేపటికిం బోరు తెగదు. జయాపజయంబులు తేలవు. రూపంబునంబలె బాహుబలంబునను నిర్వురుం దుల్యులు హెచ్చుతగ్గులు దోఁపవయ్యె. కొంతసేపటికి కిర్వురుం బరిశ్రమాతిశయంబున నెడముగాఁ రోఁజుచు నిలువంబడిరి.

అప్పుడు రంభ యాయిర్వురలోఁ బ్రథముఁ డెవఁడో ద్వితీయుఁ డెవఁడో గుర్తింపలేక పోయెను. తానదివఱకుఁ బ్రథముఁడతని ప్రియుండని తలంచుచుండెను. ఇప్పుడు దానికిఁ బెద్ద చిక్కు కలిగెను. జయించినవాఁడే తనప్రభుండనుట మాత్ర మెట్లుచితం బగు? అందువలన నది యించుక యోచించి యిట్లనియె.

మీరు పోరు చాలింపుఁడు. నేను గత వృత్తాంత మొకం డడిగెదను. దానికి నుత్తరమిండు. నా మదికి సత్యాసత్యంబులు దేటపడు. అప్పుడు మోసగాఁడు తన యిచ్చవఱ గవలయునన గత్యంతరము లేక దానికుభయులు నొప్పుకొనిరి. అపుడు రెండవ నలకూబరుండు నేలఁబడియున్న తన ఖడ్గముం బట్టికొని దవ్వుగాఁ గూర్చుండెను. ప్రథమ నలకూబరునచ్చటనుండి విన కుండునంత దవ్వుగాఁగొనిచని రంభ యిట్లడిగెను. 'నేను మణికంధరు తపోభంగమునేసి దివికింజే వచ్చుచో నీవేమని ప్రశ్నించితివి? దానికి నేనేమని యుత్తరమిచ్చితి?' దానికి నుత్తరము చెప్పఁజాలఁడయ్యె. అపుడు మరల రంభ యింద్రుండు నన్నుఁ బంపుచో నేమనియె ననియుఁ బ్రశ్నించె. దానికిని వాఁడు నిరుత్తరుఁడయ్యె.

అవ్వల నది రెండవ నలకూబరుం బిలిచి ప్రథముఁడు వినకుండఁగనే యట్లడుగ నతం డిట్లనియె.

దని యానతిచ్చినవాఁడు. అట్టి యమోఘమైనదీ యసిపుత్రిక యను నిమ్మహాయుధంబు కలభాషిణి కంఠంబు వ్రేయునట్లు పూన్చితింగాన నప్పటికిఁ దప్పించనియు వీఁడట నవశ్యంబగు నని పలుకవలసివచ్చినందుకుఁ జింతిలుచున్నాఁడననఁ గలభాషిణి చింతయేల భవితవ్యతావశంబునఁ గానున్న యర్థంబు గాక మానదనుటయు సిద్ధుండమ్మాట విని నీవెంత వివేకధురీణవు. అని యామెను మిక్కిలి మెచ్చుకొని కలభాషిణీ! నీవృత్తాంత మింకఁ జెప్పుము. అచట నిన్నెందు వెదకిన గానఁబడవైతివి. అది మొదలుకొని చెప్పుమని యడిగె.

## 16 మజిలీ

అంతఁగలభాషిణి నవ్వి మణిస్తంభునితో నెల్లరు విన నిట్లనియె. నా వర్తనమంతయు నీవవాక్రుచ్చితివి. ఇంక నేను నేమి చెప్పుదు? బలాఢ్యుండగు నలకూబరునిచే

*కలభాషిణి రంభయై వర్తించుట*

నీవు పట్టువడి నన్నుఁ జూపుటకై వచ్చుచుండ నెదురుగా వచ్చిన రంభను నేనే. నిన్నప్పాపతనిచే విడిపించి వానిందోడ్కొనిచని యభిమతకేళిం దేలిన పిమ్మట వచ్చినరెండవ రంభయే సత్యరంభ. దానితోఁ బోరాడి శాపమొందిన ప్రథమరంభను నేన. అన శ్రోతలందఱు విస్మయాంబుధిమునింగి "ఎట్టెట్టూ! చెప్పుచెప్పు. రంభారూప మెట్లొందితివి. వాని నెట్లు సంధుకొంటివి? అంతయుఁ జిత్రముగానున్నదనఁ గలభాషిణి సిద్ధుంజూచి యిట్లనియె.

బోయెనో యెఱుంగము. రంభ యిప్పుడు నలకూబరుం గూడి యున్న' దనిరే. ఇది యెట్లన మణికంధరుండిట్లనె. రంభవచ్చి నాతపంబు సెఱచి నాతో నున్నపుడు పరవశురాలై 'విడు విడురా నలకూబరా' యని గోత్రస్ఖలన మొనర్చె. అది విని నేను రోసి దానిని విడిచి చనుచు మరల మది నిల్పలేక దాని సుఖంబునం దనివిసనక నా తపోబలంబున నలకూబరాకృతి వహించి వచ్చి రంభతోఁ గ్రీడింపఁజొచ్చితి. దాని సఖులు నన్ను గుర్తింపలేక మీతో నట్లాడిరి. అవల మణిస్తంభుని నేను దఱిమి పట్టుకొనివచ్చుచో దైవికముగా రంభారూపమున నిన్ను లభించితిని. నీతో నున్నపుడు సత్యరంభవచ్చి నిన్ను శపించి వెడలఁగొట్ట దానితో నుంటిని. అపుడు సత్య నలకూబరుండు వచ్చె. వానివలన నమ్మాయారూపమునకు సద్యఃఫలమ్ముగా నట్టి శాపమ్ముఁ దెచ్చికొంటిని. పిమ్మట బుద్ధి తెచ్చుకొని నాతపశ్శక్తి కరిగి యెల్లమాయలం జాలించి నాపిదపయు మణిహారమును బుచ్చుకొని యుద్దేవి మహిమలు తొల్లి యెఱింగిన వాఁడగాన నిందేమి విశేషంబులు దొరకునోయని వచ్చితి.

కలభాషిణీ మణికంధరుల ప్రేమము

అని చెప్పి మణికంధరుండు నవ్వుచు నీవు నలకూబరుంగోర నేనైతిని. నేను రంభనుగోర నీవైతివి. కాని సుందరీ! నారద శాపభయంబున నీపై వలపుఁ బ్రకటింపనైతింగాని మన గానకళాభ్యాస దివసంబులందే నీపైఁ దలంపు నాకున్నది సుమీ. అది యిట్లిప్పుడు ఫలించినదనఁ గలభాషిణి యిట్లనియె.

ఇప్పటికిఁ గృతార్థురాలను. నన్నుఁగూడిన వంచకుఁ డెవ్వఁడో! యని పెద్దకాలము విచారమునఁ గ్రుంగిపోవుచుంటిని. నీవగుట తెలిసినపిదప నాహృదయము కుదుటఁబడినది. ఏలయన వినుము. శ్రీకృష్ణసభలో నీకవిత్వము వినినప్పుడ నీపైఁ బ్రేమము మొలకెత్తెను. నీపై మదినిలుచుటంజూచియో నీవంచకము నన్ను హత్తుకొనియె. పిదప నీతలంపు నెఱుంగుటం జేసి గంధర్వుండ వగు నీకు నేను దగనోయను తలంపున నాభావము మరల్చుకొన శ్రమమొందితి. నీసౌందర్యము నీసంగీతనైపుణ్యము నీకవితామాధుర్యము నాహా! నన్నెంత యానందపెట్టెనో యిప్పుడు చెప్పిన నెవరు విశ్వసింతురు? పోనీ! నామనస్సు నాకే సాక్షి. అదియుఁగాక మణికంధరయన్న పేరు వినుటతోడనే మణిగ్రీవుని పేరు స్మృతిపథమునం బడును. వెంటనే నారదమహాముని నలకూబర మణిగ్రీవుల మద్దిచెట్లుగా శపించిన విషయముతోఁచును. అక్క– తనగుండె గుభేలుమన నీకపకృతి జరుగునో యని శంకించియు నీపైఁ బ్రేమను వెనుకపట్టించితిని. అట్లయ్యు నీ రూపరేఖలుంట చేతనే నలకూబరుం గాంక్షించితిని. వానింగన్నపుడు నిన్నుఁ జూచినట్లయుండె. ఎట్టి పాపపువేళ వానిం జూచితినో కాని వానిఁ జూచినపిదప మఱొక పురుషుని గన్నెత్తిచూచి యెఱుఁగ పడఁబోయి పూలపాన్పునంబడినట్లు భాగ్యవశంబున నలకూబరుండని నిన్నుఁబొందితి. దివ్యమణి చేతికబ్బగాఁ బాఱ వైచి తచ్ఛాయ నొకింతయున్న గాజుపూసకై వాలఁగష్టపడితిని. నాయవివేకము నేమనుకొనను. ఇసి యెట్టి మాటలు వారవనితవిగదా. ఎవరు నమ్మెదురు? అదియునుగాక యన్య

వాంఛ ప్రత్యక్షము. అని లజ్జాశోకంబులడర నవనతముఖియై యున్న కలభాషిణిం జూచి మణికంధరుం డిట్లనియె.

ఓ కాంతోత్తమ విలాసినీ! నిన్నితర వారవనితల యట్లసత్యవాదినిగాఁ దలంచునంత మూర్ఖుడఁగాను. నీకు నాపైఁ గోరిక గలదనుటకు నారద భగవానుండే సాక్షి. ఆయన నిన్ను బ్రోచుచో నన్నమాటలు జ్ఞప్తియందున్నవా! 'కొమ్మా! నీవిన్ని నీ వాత్మలోఁ గోరుకొన్న కాంతు రంభామనోహరాకారుఁ డగుచు మెఱయువానిని గూడఁగలవు.' అని నలకూబరుని పేరెత్తియనక యిట్లనుట యమ్మహర్షి నీభావము నెఱింగియే సుమా! ఆయమోఘవచను పలుకులెట్లనృతములగును? కాన రంభామనోహరాకారుఁడగు నాతో నీవు గలిసితివి. ఒక్కొక్క రూపమును జూచినప్పుడే యొక్కొక్కరికిఁ బ్రీతి గలుగుట లోకమునను న్నదే. నీ ముఖమునన ప్రొద్దుపొడువ లేదు. దీనికి విచారింపకుము. ఇట్టి విచిత్రప్రేమకుఁ దార్కాణముగా నొకకథఁ గలదు. అది పాపనాశకరము గాన దాని నాకర్ణింపుము.

## 17 మజిలీ

మణికంధరుండు కవితను సాధించుట

అనునంతరగో సుముఖాసత్తియందుకొని తొల్లి యుద్దేవి మహిమల నెఱింగింపవాఁడ నంటివి? నీవెట్లెఱిఁగితి వన నది యుం జెప్పెదనని మణికంధరుం డిట్లనియె.

నన్నుఁగని రారమ్మని యాదరించి పూజ్యులు వచ్చినపుడన ధ్యాయమని శిష్యులకు సెలవిచ్చి నాకుల గోత్రనామంబులడిగి నాతో సంభాషించుచుండెను.

ఇంతలో నొక ఛాత్రుండు పుస్తకహస్తుఁడై యేతెంచె. వేదగురుం డతనిం జూచి 'ఏమిరా? యింత యాలసించితి' వన వాఁడు స్వామీ దానికి నిమిత్తంబు చాలఁగలదు. మీకు శబ్దము వినఁబడదు కావలయును. ఐన వినిపించెద వినుండు.

సుగాత్రీ శాలీనులు ప్రహసనంబడినని
శిష్యుఁడు చెప్పుట

బాగు పొత్తముఁ దెమ్మనిపంప నేనచటి కరిగితిని. అపుడు శాలీనుండు తమ పువ్వుఁదోఁటలో నొక్క లతా గృహంబునందుఁ దన పాదంబు సుగాత్రి వేసుకొనిఁ దొడలమీఁద నిడుకొని యొత్తుచుండ నిష్టసల్లాపంబుల సలుపుచుండి నన్నుం జూచి నిన్ను మా యుపాధ్యాయులు పుస్తకమున కంపిరే? అది యిక్కడనే దేఁ దాచినాఁడ. అని తమ యుపరిభాగశాఖం జూపికొంచుఁ బోదువుగాని యటుఁ గూర్చుండుమని యెదుట నున్న లేమామిడిక్రింది వేదికం జూపిన నేనటుఁ గూర్చుంటి.

అంత శాలీనుండు తనయింతి మూఁపుఁ జేయుచి ఇట్లనియె. 'రమణీ! అమృతము సేవించితినా? లేక సిద్ధరసమేమైనఁ నబ్బెనా? నీకోమలం ప్రాయము దినదినమునకుఁ గ్రొత్త క్రొత్తగ వెలుఁగుచున్నది. పురుషుని కన్నము మను పోలఁతికిఁ ప్రాయము తగ్గునంద్రు. నీకట్లుగాక యంతకంతకు మొగ్గుచున్న

సుగాత్రీ శాలీనుల కథ

అపుడవ్వేద విప్రుం డిట్లనె. మణికంధరా! ఇవ్వాడుగు తెచ్చిన పొత్తమునకు వారి పూర్వ చరితము కలదు. నేటితో నా పుణ్య దంపతులంజూచు భాగ్యము సమకూరినది. అని యా గ్రంథముం దానందికొని కన్నుల నద్దికొని శిరంబున మోపికొని యయ్యంతేవాసికిచ్చి చదువుమన నతండు చదువ మొదలిడెను.

కాశ్మీరమున శారదాపీఠముగలదు. ఆ శారదా దేవిం బూజించు పూజరి బ్రాహ్మణునకు సుగాత్రి యను పుత్రిక గలదు. ఆమె భర్తపేరు శాలీనుండు. ఆతండిల్లటపు టల్లుండై తన స్వగ్రామమునుండివచ్చి యత్తగారి యింటనే వసించును. ఆ శాలీనుండు నిషేకముహూర్తావసరంబునం దన కడకువచ్చిన సుగాత్రిని సాలంకృతంజూచి తలంకి యామె నంటుకొనక సంకోచించెను. ఆ ముగ్ధయుం గొంతసేపు చూచి తిరిగిపోయెను. తెల్లవారంగనే యొకరి మొగ మొకరు చూచుకొనుచు నెచ్చెలులు నవ్వుకొనిరి. ఆ మూడునాళ్ళు నట్లజరిగె. వాని సతి వట్టి రాకపోకల నొనర్చెను. ఆవల నిదియేమి సోద్యమమ్మా! యనుచుం దత్ప్రియ వయస్య లేకాంతమ్మున సుగాత్రితో నిట్లనిరి.

మేలు, మేలు, ఇద్దఱు వివేకులే. సరిసరి, బాగుబాగు.

నెచ్చెలీ! కాంతుఁ డుచితజ్ఞుఁడైనఁ గాంత సిగ్గుపడం జెల్లుఁగాని కాంతుఁడు సిబ్బితికాఁడైనపుడు కాంతయు వగ్గిన నింక నెట్లు కాపురము. ఏమి పసిపాపవా? అతఁ డూరకుండెనని నీవును బతికి సేవఁజేయఁ దొడఁగకున్న నొప్పునటే. మగవానికేమి? వాఁడు భాగ్యవంతుఁడు. వానికిం జెల్లుఁగాని మగువకిట్లు మానవుబిగిమానము చెల్లదు. తనంతటనె యూరకుండినటు లేయుచున్న నగ్గిచెంగటి నేయివలె నతని డెందమే కరఁగును. మగఁడు రమ్మన లేదని చూడ లేదని యంతటనే తిరిగి రావచ్చునా? ఆకలిరాదా? భోగాలీరాదా? అయిశ్వర్యసౌఖ్య భోగాల వంటచేనుగాదటే పరువము? అట్టి బంగారమువంటి ప్రాయమును రిత్తకయ్యి కొసఁగుదురటే? ప్రాయము సిగిన వెనుక నేమి యనుభవింతువే? యౌవనమున్నపుడు గాదటే పతుల భోగాలు? అని యెన్నియో చెప్పిరి.

అంతయు విని యమ్మగద "యీ పెంకిమాటల నన్నిటికిం జంపెదరే? పొందుపొందని సిగ్గుపెంపుసం బలికె. కాని యారాతిరి కొన్ని యుపాయముల నాబాలిక నిపుణముగాఁ బ్రయోగించి చూచెఁగాని ఫలము శశవిషాణంబయ్యె.

అంతఁ గ్రమముగా నామె మదిని రాయిచేసికొని "నామగండు లోకవిలక్షణుండు. ఆయనను బాధింపనేల? బయటఁ బెట్టనేల? పెట్టినమాత్రము ప్రయోజనంబేమి? నాకును మంగళసూత్రం బీపాటి సుస్థితినుండుటయు పదివేలనుచు నెంచుకొని యీయన నొక్కలాగు చూపెక పతియాయుర్వృద్ధికరంబులని వివిధాలంకారంబు లెప్పుడేమటిన తాల్చుచుఁ దన

తల్లియతని నేమియు నిట్టట్టాడకుండం బ్రార్థించుచు దినములు గడుపుచుండె.

ఆమెతల్లి యంతయు నాసనపట్టి కూఁతునిర్బంధమున నల్లు నేమియు ననక కొన్నివాసరంబు లోర్చికొనెను. కాని కూఁతు నెలప్రాయ మడవిఁగాసిన వెన్నెలయగుచుండఁ దల్లులెంతకాల మోర్చియుండఁ గలరు ?

శాలీనుఁడు తోఁటపనికి నియుక్తుఁడగుట.

ఒకనాఁడు నందనతో నామె యిట్లనె. ఇట్టినిరర్థకుని నేనెందుంగాన. నేనేమి యనంబోయిన నీ వడ్డకువచ్చి నన్నుఁదిట్టెదవు. నాసంపద కొక మగమొల్క నీకెప్పుడు పుట్టునా? యని పుట్టెఁడాసతో నుంటి. అదియంతయు నమ్మరయ్యె. వీఁడు వట్టిగొడ్డు తాఁకట్టయ్యె. ఈపనికి మాలినవాని వెళ్ళఁగొట్టిన నీవుస్సురని యేడ్తువు. గృహకృత్యములైన వీఁడుచేయకున్న నాఁడు దాన నెంతవఱకుఁ దిప్పలు పడఁగలను? అని మెల్లగా నల్లుఁబిలిచి "అయ్యా! పూలతోఁటకైన నటుపోయి విచారించి రావలయు. నాకొక్కదానికిఁ బనితూఁగుట లేదు. మగవాఁడవు నీవు సాయపడకుండ నెట్లు? అని క్రమక్రమముగా నల్లునికిఁ దోఁటపని నొప్పగించెను.

వాఁడును నది శారదాదేవి కుపచరించు కార్యముగదా. ఇది నాకుఁ బ్రియంబయని నాఁడు మొదలు శాలీనుఁడు తోఁట కేఁగి కాలువలు ద్రవ్వును. నీరెత్తును. పాదులకుఁ ద్రవ్వాటములు పెట్టును. ఎరువుచల్లును. అంట్లొత్తును. నారుపోయును. ఒకఁ

డేమి యెల్లబనుల జీతగాఁడువలెఁ జేయుచుండెను. ఇల్లటపు టల్లునిగతి యింతగాక యెంతగును ?

ఇట్లా పూజరి బ్రాహ్మణుఁడు ప్రొద్దుననే లేచును. తననిధులు కులాచార ప్రకారము నిర్వర్తించుకొనును. గురుపరంపరం దలంచుకొనును. జపము చేసికొనును. పూలదండలు వింత వింతలుగఁ గట్టి శారదాదేవి కర్పించును.

సుగాత్రి యిట్టి యవమానములంజూచుచు మగఁడు కష్టపడుటకు సహింపక తోడుపడఁజూచును. కా[illegible] యుత్తర్వు వచ్చును. తానేమియుఁ జేయలేక యుస్సురుమనును.

గాలివాన

అంత నొకనాఁడు భయంకరముగ నుండి నాశనంబునకై కాలాభ్రంబులు గుమిగూడెను. కన్నుఁబొడుచుకొన్నఁ గానరాక చీకట్లుముకొనెను. తోడనే పెళఉరుముల తోడను మెఱుపులతోడను వడగండ్లతోడను పిడుగులతోడను గాడ్పులతోడను నేలఁగూలు తొండముల ధారలతోడను జడి వాన బాదసాఁగెను. జగమంతయు జలమయమగునట్లుండెను. వృక్షమ్ములు కూఁకటివేళ్ళతోఁ గూలసాఁగె. కొంత తడవునకు వానబాధ తగ్గెను గాలి బాధ మిక్కుటమయ్యెను.

అట్టియెడ సుగాత్రి చినుకులు ప్రారంభమైనది మొదలు మదిలోఁ బరిపరివిధముల విచారింపసాఁగెను. 'నాథా! నీకి పాపపుఁ బువుదోఁటపాలైచటఁ గష్టములయ్యె. అయ్యో! యీ పెనువానలో నెట్లుంటివో! కట్టా! యింకను వాన వెలియదాయె. ఓ తల్లీ! శారదా! దయాశాలినీ! నా ప్రాణే

శ్వరుఁ గాపాడుమీ. నాపతి పాపముల నాపైవైచి నన్నందులకు శిక్షించి వారిని రక్షింపవే. అని యిట్లు ప్రార్థించుచు మాటిమాటికి వంగి తొంగిచూచుచు నెట్టును గదని నిల్వలేక యతి సాహసంబున నవ రేమనుకొన్న నేమి? ఏ నైన నేమి? యని యాగాలివానలో బతింజూచినచ్చుటకు బయలుదేరెను. త్రోవలో నాశారదా కృపాకటాక్షమెట్టిదో యామెపై నొక్క-చినుకైన బడదాయె.

సుగాత్రి గబగబ తోటకరిగి భయంబుచే మారంబునన యుండి భర్త నిరపాయుండై యుంటఁ గనిపెట్టి 'నాతల్లీ! సరస్వతీ! నీభక్తవాత్సల్యమింత ప్రకటించితే? యని తత్కారుణ్యంబునకు నుబ్బుచుఁ గ్రమ్మఱ గృహంబునకువచ్చి తనవచ్చుటయుఁ బోవుటయు నెవ్వరికి నెఱుకపడనీక ప్రీడావశంబున నడఁగిమడఁగి యథాపూర్వస్థితిఁ బ్రవర్తిల్లుచుండెను. గాలివాన పోయినపిదప నాతోట యుంచుకయు జెడగకుంట కూరివారెల్ల నెంతయుఁ జెప్పికొనిరి.

సుగాత్రి భర్తను గాపాడుట

ఇట్లు సుగాత్రి మఱియుం గొన్ని దినంబుల లజ్జాతిశయంబున వల్లభుని యెడమనుపాట్లకోర్చి యోర్చి యావల ధైర్యసాహసంబుల కలిమిం బ్రసంగింపబడం దన్ని సంపూర్ణప్రతిభ ప్రకటితంబునఁ దల్లిమాంటలంగాడఁ గైకొనక యెప్పటియట్ల యలంకృతాంగియై తోటకరిగి యచట నిజాభరణమ్ములనెల్ల దీసి యొక మఱుఁగున భద్రముగా నిడి చీరకుచ్చెళ్ళు వెనుకకు దోఁపుకొని పొడవుగాఁ బయ్యెదందీసి నడుమునకుఁ బిగిచుట్టి

కరిగెను. అప్పుడే యప్పడంతి చెలులు పసివట్టిరి. చుట్టు మూఁగిరి. నర్మాలాపముల వినోదించిరి. ఆవలఁ గల్లియుఁ బ్రమోదము నందె. అక్కాలమున నాఁటి రాతిరి యెప్పటికంటె మిగుల నామె నలంకరించి చెలులు కేళికాభవనమున కంపిరి. ఆ పల్లెటూరిబావని కా రూపంబింపుగా మి నటు కన్నెత్తిచూడఁడాయె. ఆపడంతుక సన్ననిసన్నపనులు నాపయ్యెదగ్రొమ్ముళ్ళింతలు నాచెమ్మగిల్లి నాఁటినకమ్మకస్తురి చుక్కయు నాగునిసి సడలిన క్రొవ్వెదయు నొకటియేల యాఁతోఁటలోని రూపమే వానిహృదయఫలకమునఁ దాండవమాడుచుండ నిట్టాలితాకుండె చూచుచుండెను.

అప్పడప్పడంతి యట్లుయుంచుక తడవు చూచి చూచి నావలన నేమి యెప్పుమియుప్పతిల్లెనో యని యింతవిషాద మొంది తిరిగి యరుగఁ జూచె. మగఁడు వెంటనే యిట్లు తలంచె, అరిగి మాత్రమేమి గానో యిచటను యూఁగినపడియుండెద. పదపడి దైవమేమి చేసిన నది చేయుఁగాక. యని యెంచి తలుపుకడన నిలిచి యుండెను. తరువాత నర్ధమూర్ధ కాలంబున కయ్యింతి యెంత యుండఁబంపు సేసి కాంతు చెంతకరిగి 'కడుఁగ్రొమ్మిటచే శ్రమ ముందినారా కాఁబోలును. పోనిమ్మా? నిదురవోయెదరే' యని కప్పురపుఁ దాంబూలపుఁబాగాని గుప్పున నెయిదండఁ బల్కెను. పల్కిన నతండే పరాకునను "ఏకోర్కి నచ్చితి" వనె. ఆమె వెంటనే గోకము వారలు పతికడకే కోర్కినిచ్చుకు! అనుచు నిట్టూర్పు వుచ్చెను. అతండును మఱి మాటాడఁడయ్యెను. అవ్వల నామె తాలిమివహించి 'యితరములు పోనిమ్ము : ఏకోర్కిని

వచ్చితనని నామదిలోని కోరికఁ దెలిసికొన నడిగితిని. అంతియే చాలు. ధన్యనైతిని. కాని నాథా! నావలన నేమి నేరము జరిగినది. ఏల మీకింతకోపము? వేగుజామైనది! అట్లు కన్నెత్తిచూచుటగాని, దగ్గఱకురమ్మనుట గాని, పాదములొత్తుమనుట గాని లేదాయె. నేఁడుతోఁటలో నాభాగ్యము పండఁబట్టి యీదనపునని ట్లడిగితింగాని పూజ్యసాధ్వీకిది గుణముకాదని యెఱుంగుదు. పోనిండు. దానికేమి! ఈపాదసేవ నాకింత లభించినం జాలునని యల్లనఁ బాదముపట్టి పాన్పుగడఁ గూరుచుండి పాదములొత్తి కంటనద్దుకొని చెక్కిటఁజేర్చుకొని వటువును మాపుకొని 'నారాయణ నారాయణ! మీమనసుకంటె రాయియైనం గొంత మేలుగదా' యని పలికె. ఎన్నియన్నను నుత్తరమీయఁడు. ఆతోఁటలోని గోపరూపము నే స్మరించుచుండెను. అతని కది రుచించినట్లే విభూషితాంగము గానింపదాయె. ఆమెయట్లే పాదసంవాహన మొనర్చుచుండె, భల్లునఁ దెల్లవారె.

## 19 మజిలీ

ఎప్పటియట్ల శాలినుండు విహితానుష్ఠానము చేసికొని వనంబున కరుగ సుగాత్రియు వెంటఁ జని సిరలంకృతాంగియై స్వతస్సిద్ధాత్మస్వరూపలావణ్యము సొంపెసలు గులుకుచుండ నెల్ల పనులు సేయుచు మరలఁ జతి మన్ననలం గాంచి యున్నాఁడా విజ్ఞురాలి భూషణాది కృత్రిమసౌందర్య మయ్యనఘున కింపుగాదని గుట్టెఱింగి ప్రాణేశునిష్టప్రకారము వర్తిల్లసాగె.

తల్లి మందలింపు

అంత నొకనాఁడు తదంబ యేకతంబున సుగాత్రితో నిట్లనియె. అమ్మా ! నీవు సరస్వతి వరంబున జనించితివి. నీవు చిన్నతనమునుండియుఁ బ్రియుని జిన్నమంతమాట నెవరన్నను మిక్కిలి పరితపించెదవు. ఆతని నెవ్వరే పాటి తడవినను జెవిఁదోరఁ బెట్టుకొని విని యుప్పొంగెదవు. పొరపాటుననైన నితర పురుషుల యూసు నెత్తవు. వారి ముందయిన నాలకింపవు. ఎల్లపుడు విభుని శుభముని సర్వదేవతలఁ బ్రార్థించుచుందువు. అతఁడు హర్షించిన హర్షింతువు, చింతించినఁ జింతింతువు. అతఁడు చన విచ్చిన గర్వింపవు. ఈసున్న ఖేద మొందవు. ఏది వచ్చినఁ దొణఁకక నిండుకుండవలె గంభీరముగా నుందువు. పతిప్రవాసగతుఁడైన నలంకరించుకొనవు. ఈ విధంబైన నీ పతిభక్తి కతంబుననే యా తల్లి శారద నిన్నుఁ గృపఁజూచుచుండును. నీ మీఁద నా దేవి కెంత వాత్సల్యమో - నే నొకసారి నా కష్టాలఁదలంచి కనుమూయ సుగాత్రివలన నీ వంశము వెలుఁగు నన్నమాట వింటిని. ఆ దేవియే యట్లు పలికినదని నా విశ్వాసము. కనుకఁ బెనిమిటి దేశాంతరగతుఁడు కాఁగా నీ సంతతి నన్నుద్ధరించునని గంపెడాసతో నుంటిని. అమ్మా ! ఏమనుకొనకుము. ఒక మాట. అకాలమందుఁ బతిఁగూడిన నవగుణ గణ సంతతికల్గు నండ్రు. అది యొకటి నాకుఁ గొదవగాఁ దోఁచినది. అదిగాక కూఁతురా ! మీరు వని కరుగ నేల ! ఏదో ! అప్పుడు నిన్నేల లేదన్న కోపమున నట్లాడితింగాని, యేమీ ? మనకు జీతగాండ్రు లేరా ! కనుక నిఁక మీరు వెళ్ళకుఁడు. అమ్మా !

ఏదో - పెద్దదానను, తల్లిని గనుకఁ జెప్పితిని. నీవు మాత్రము విధి నిషేధము లెఱుంగవా? వయసునఁ జిన్నదానవైనను వివేకమునఁ బెద్దవే!

అన మొలకనగవు మొగమునఁ జిగిరింప సుగాత్రి యిట్లనియె అమ్మా! నావరునకెద్ది ప్రియమో యదినాకు విధి. ఏది యప్రియమో యదినాకు నిషేధము. కాన శాస్త్రము, వేదము, గురుఁడు, నీశ్వరుఁడు, సర్వము నాకు భర్తయే. ఇదినా దీక్ష. ఎవరుచెప్పిన దీనినేను దాఁటను. [illegible] శాస్త్రములందలి విధినిషేధము నేనంగీకరింపను. భర్త చేయుమన్నఁ జేయుదు. మానుమన్న మానుదు. తల్లీ! విభునిమాట వేఁదికి వేదము గాదటే.

అనిసుగాత్రి పలుకఁ బలుకుల వెలఁది యాపలుకుల కలరి వారికఁ బ్రత్యుత్తరము సుగాత్రిం గారవించి తజ్జననింజూచి యీపాద్వర్తన కెట్టులు వంకలు దిద్దఁజూడకుము. ఈ మోసుస్థిర పాతివ్రత్యమునఁ దప

**సరస్వతీ సాక్షాత్కారము**

పావమ్ము నగాక మీయుభయ వంశ[illegible] పాపమ్మును భస్మమగుదుర్వే. ఇదియు [illegible] జగంబున వెలయు. వెలయుననేల [illegible] యీ మోక్షమను నేనవెలయించుదాన ననిపలికి యదృశ్యయయ్యె.

అనివటువు పొత్తముం జదివి కట్టిపెట్టెను. అప్పుడు వేద గురుండు నాతోనిట్లనియె. మణికంధరా! ఆసుగాత్రీశాలీనుల యందు శారదకెంతదయయో? నాకునద్దేవియు కలలోవచ్చి

యీహొత్తము నిత్యము ప్రాతఃకాలమునఁ జదువుకొనుమని యిచ్చె. మఱియు నారాత్రియందది యిప్పటంజదువ వ్రాయ నేర్చినవారికెల్ల నట్లయిచ్చినది. అందఱము వెఱఁగుపడితిమి. నిన్న నేనాపుణ్య దంపతుల సందర్శనమున కరిగి వారిచేఁ బూజింపఁబడి యచ్చట నీహొత్తము మఱచివచ్చి నేఁడు కేసకడఁ జదువంబోయి తలంచుకొని యది తెచ్చుటకుం బంపిన నిట్టిఘోర వార్త వచ్చె. అని వారికై పెక్కులాగుల వగచె.

నేను నాయధ్యాపకుని వీడుకొని పురంబెల్లఁ దద్విచార మగ్నంబైయుంట నరసి మత్కావితాగోష్ఠికిది యదనుగాదని మరలి నాగలోకంబున కరిగితి. పిమ్మటఁ గొంతకాలమునకు సంగీతవిద్య సవిశేషంబుగా నభ్యసింప వేడుకపుట్టిన నారదమహాముసిం గొలిచి తిరుగఁ దొరకొంటి. అని చెప్పి మణికంధరుం డోకలభాషిణీ! శాలీనుని చందము వింటివిగదా! అతండు కుగ్రామంబునఁ బుట్టిపెరిగినవాఁడగుటచేతనో మౌఢ్యంబుననో యలంకృతాకారముఁగని కలంగును. విచ్ఛిత్తి విలసితాకారముఁ గని కరంగును. భవదీయవృత్తంబు నిట్టిదే. ఒక్కొకరూపమున నున్నవాఁ డొక్కొక్కరికిఁ బ్రీతి గలుగుట లోకమున నున్నదే.

అని మణికంధరుండు సుముఖాసత్తిం జూచి "అమ్మా! నీది శాల్మీరమగదా! నీవేల సుగాత్రి నెరుంగవు? అన నామె యేల ఎరుగను? నేన సుగాత్రినని యామె నవ్వెను.

సుగాత్రియే సుముఖాసత్తి

అమ్మాట కందఱుఁ జోద్యమంది 'నీవా సతివే! ఎట్లు బ్రదికితివి? ఏల మాఱుపేరు దాల్చితివి? అన

సుముఖాసత్తి యిట్లనియె. పతి పాదపద్మములనే మదినిల్పి యమూ నూఱుతాటిచెట్ల లోఁతుగల మడుగులోఁబడి మునుఁగుచో నడుమ నన్నొక మొసలి మ్రింగె. మ్రింగిన వెనుక నన్నరిగించు కొనలేక యది తత్తీరభూమిఁబడి పొరలాడుచు మఱునాఁడు నన్ను వెడలఁ గ్రాసినది. ఆవేళ నచటనున్నవారిది నాకుఁ జెప్పిరి. అంత నే నెల్లరు వెఱఁగంద నింటికేగి పతిని దిగుఁగార్చ నీవే భారము తల్లీ యని శారదాదేవిని ధ్యానించుచుఁ గాలముగడిపితి. పిమ్మట జరాభారంబునఁ జేసి నాక్రమింప వాణియెట్లు సేసినట్లు గానిమ్మని తలంచితి. ఆ తల్లిపై భక్తికిఁ దోడు నా భాగ్యమును బోడసూప యోగవేదాంతశాస్త్రజ్ఞుల గోష్ఠులలోఁ బ్రౌఢవుచ్చు చుంటిని. సుముఖులన శాస్త్రవిదులుగదా. నిత్యము తత్త్వా న్వేషణమున మెలఁగుచున్కి నన్నందఱు సుముఖాసత్తియని పిలువసాగిరి. అంతఁ దల్లి తగులాటమును దెగిపోయెను. ఇఁక నేమి? తీర్థయాత్రలకు బయలుదేఱి క్రమముగా నీ తల్లి మహి మములు విని యిచటుచేరితి. పిదప కథ మీరెఱుంగుదురు. అట్లు పేరొందిన నేనిట్టి దశ నొందితి. నా విభుండు మడుపునఁబడి యే మయ్యెనో యెఱుంగను.

మణిస్తంభుఁడు నేనే నీ పతినండ ననుట

అనుడు మణిస్తంభుం డిట్లనియె. అతివా! గ్రాహముమ్రింగి మఱునాఁడు వెడలఁగ్రక్కి నను గనుఁగొందనీక నిన్ను బ్రదికించిన నీ పాతివ్రత్యము నీ భర్తను బ్రోవకున్న? అతని పొందు నీకుఁ బ్రాపించును. ఎక్కడనున్నాఁడతఁడందువా? ఇక్కడనే. ఏఁడీ యందువా? వీఁడే. యని తన్నుం జూపు

కొన నెల్లవారు నబ్బురంబునఁబరికించుచుఁ బ్రపంచంబున నెన్ని విచిత్రనాటకంబులు! అయిన మీ కథంగూడఁ జెప్పఁ దన సుగాత్రిం జూచి మణిస్తంభుండిట్లనె.

ఏమి కర్మమో? నీ మాటకపరిమిత రోష ముదయించినది.

ఆ రోషావేశము నిరోధింప లేక యట్టిచని శతతాళ దఘ్నమున నంటికొంటిఁగదా. వెంటనే మునింగి యమ్మడుపున జలస్తంభవిద్యచే స్వగృహమందున్నట్లు వెలుఁగుచున్న యొక యోగిపుంగవుం జేరి యాపాటువలననైన యలసటచేఁ బ్రక్క కెగయఁగోఁజాచు నొక్క క్షణము నిలిచిచూచితి. అపుడ యమ్మహాత్ముఁడు సమాధి చాలించి కనువిచ్చి నన్నుఁజూచె. నేను వంగి భయభక్తులతోఁ బ్రణిపాత మొనర్చుచు మత్పతన వృత్తాంతమునుడివితి. ఆయోగీశ్వరుండెంత మంగోపివయ్యా యని నవ్వి యిది విజనస్థలంబని యిందున్నాఁడ. పరులనిందు క్షణమైన నుండనీరాదు అని నా మొగంబు సూచి దయగలిగి నాఁడు మాత్రము దనకడనుంచుకొని నా గురుభక్తి కలరి నయ స్తంభనమణిని దానెక్కు సింహవాహనమును దద్యోకర సౌషధజ్ఞానమును రసవాదవిద్యను నీ ఖడ్గమ్మును వేడ్కతో నాకిచ్చి నన్నంపుచు 'నేమ సూర్యా! యీ వాలునెవరి వేయ నెత్తుదువో యవశ్యము వారిం జంపుఁజుమీ యని నుడివెం. నేను బునః పునః ప్రణామములాచరించుచు నాదివ్య పురుషుని నాకర్షణమున నటకు మున్నవచ్చియున్న యవ్వారువమునెక్కి మడమఁ దాఁకించు మాత్రలో నాప్రాంతమువెడలి య

యాకసంబున౦ బర్వఁదొడంగెను. అందులకే నలరుచు 'నహాహో! యోగసిద్ధులు బ్రహ్మాండమును గుప్పిటఁ బట్టఁ గలరు. వారిసాన్నిధ్య ప్రభావము నేమనను? నాకును నట్టిచో నుదక ప్రతిబంధకమ్మొకటి లేదయ్యె.' అని పెక్కుతెఱంగుల గురునాథుని స్మరించుచు ధాత్రింగల విచిత్రంబులనెల్లఁ జూడ మొదలిడితిని. వయస్స్తంభమణివలన నేను మణిస్తంభుండను పేరు వడసితి. గురుదేవుని శిష్యుఁడనగుట నేనును సిద్ధవేషము వహించితి. పిదప నీ మృగేంద్రవాహనా మందిరముఁ జేరి యీయూరి వేడుకలలోఁబడి నీమాటయే మఱచితి.

పరీక్ష

అన నవ్వాంగిజాతి నవ్వి నీవు శాలినుండవే? ఐన నీ నల్లనాఁడు నీకంత కోపము గల్గించు నేమాటను నీతో నంటిని? అంతకుముందు నీవేమాటను నాతో నంటివి? అనియడిగి యతఁడు నోరెత్తఁబోవ నంతఁ గుమారగురుఁడు అని వారించి కలభాషిణింజూచి నీవిటురమ్ము. నీశారవహాస్యము ముందుగాఁ జెప్పెదను. తరువాత నాయనచే వినవచ్చును. ఇట్లైన నెల్లరకు లెస్సగానుండును. అని దానిచెవిలోఁ జెప్పఁబోయి మరల నంతలో 'నాహాహా! ఇదిగా దుపాయము. నేనునీకు కర్ణకర్ణముగాఁ జెప్పుచున్నను దూరశ్రవణశక్తివలన నితండు వినఁగలండు. అదిగాదు. వ్రాసియుంచి యాలినిచేఁ జెప్పింతమన్న దూరదృష్టివలన నితండు నా వ్రాఁతం జూడఁగలండు. కనుక నిప్పుడెట్లనుచుండ మణికంధరుఁ 'డమ్మా! అట్లయిన ముందు వీనివలన నేనదివినెదను. పిదపనీవు చెప్పుము. అని మణిస్తంభు నేకాంతమునకుఁ దోడ్కొనిపోయి యుల్లనాటి

కోపహేతువులైన రహస్యవాక్యంబుల నెఱింగివచ్చి సుముఖా సక్తితో నీవేమని చెప్పెదవు. చెప్పుమన నాతరుణి యిట్లనియె. మనువునం బడుటకు మును శాలివాహనుండు నాతోఁ బ్రసంగవశంబున నిట్లనె. రమణీ! యమృతము సేవించితివా? లేక సిద్ధరసమేమైన నబ్బెనా? నీకౌమారంబ్రాయము దినదినమునకుఁ గ్రొత్తక్రొత్తగ వెలుగుచున్నది. పురుషునికన్న మును పొలఁతికిఁబ్రాయము తగ్గు నండ్రు. నీకట్లుగాక యంతకంతకు మొగ్గుచున్నదేల? యన నాకేమియుఁ దెలియదంటిని. తెలియకున్న నేఁ జెప్పెద వినుమని విభుఁ డిట్లనె. నేను నీయౌవనానుభోగంబునం దనియక నీకుఁగర్వము రాకుండునట్లు పూజా సమయంబున శారదాదేవిం బ్రార్థించితి. ఆ జనని యట్ల యగుఁగాక యని వరమిచ్చె. అక్కతన నీ ప్రాయమిట్లున్నదంటెని. అనుటతోడనే నేను వెఱఁగుపడి 'ఇది యేమి? నే నొకనాఁడు వేఁడుకొనగా శారదాదేవి' నా సంగమమున నీకుఁ బుత్రుఁడు గలుగునట్లు వరమిచ్చినదే. ఈ రెండు వరము లెట్లు సరిపడునంటిని. అనుడు నతండు దుర్దమక్రోధావిష్టమతియై నాయిష్టమునకు విరుద్ధముగా నీవిట్లు వరమడిగితివా? యని రయంబునం జని హ్రదంబునం దుమికె.

అని చెప్ప మణికంధరుం డీర్ష్యారమాట యైక్యమగుటచే మేలు. మేలు. అమ్మా! సందియంపడకు మితండు నీవిభుండ యనె.

కంటె నీనాతల్లియెదుటఁ బ్రాణము దొరఁగుట శుభకరము గాదె? ఇఁకఁదడయనేల? ఆలస్యాదమృతం విషమయ్యెన విన రే యన మణిస్తంభుం డిట్లనియె.

కలభాషిణీ! యిటుచూడుము. తొలుత నేను నిన్నుఁజంపఁ గత్తి యెత్తినపుడు సుముఖాసత్తి దేవిపై నాన పెట్టినది నిన్నుజంప కుండుటకు. కాన నేను నాచేతితో నిన్నుఁ జంపను. ఆయాసంగ ణింపక నేను సాహసించినందులకుఁ బడ్డపాట్లు చాలును. కాన నన్నిటం దగినవాఁడీ మణికంధరుండీ పనిం జేయుంగాక నేనీ కార్యమునకిమిచ్చెద నన సుముఖాసత్తియునిట్లనె.

ఔనౌను. ఇతండు తపస్వియు, విష్ణుభక్తుండును, మీఁదు మిక్కిలి దీనికిఁ బ్రియుండును, కనుక నితండీ పనికి నొడిగట్టవచ్చును. అని యతనితో 'నాయనా! నీవీకార్యమున కియ్యకొనుము. నలకూబరు శాపానుభవంబునకుఁ గాచికొనియున్న నా కేల రాజ్యమునకును. దేవీప్రసాదంబున కేది దుస్సాధ్యము? ఆతల్లి యేమిచేయునో మన మెఱుంగలేము. మఱి నెచ్చెలిం జంపిన దుష్కర్మంబుగాదా? యని విచారింపకుము. అనివార్యంబైన రంభాశాపంబు నీచే యన్యార్థమునకు వినియోగింపం దలంచి తనయంతన చేరి యత్యంత ప్రార్థనంబు చేయుచున్నది. కనుక నిది దుష్కర్మం బనరాదు. కర్తృభోక్తల నిరువుర నిద్దేవి యనుగ్రహించును.

అనుడు మణికంధరుండు నిర్బంధంబున నియ్యకొని నియమ పూర్వకంబుగా నవ్విధికిం గడంగె.

కలభాషిణియు మణిస్తంభునకుం దఱంగనకుం బ్రణామంబు
సేసి మిమ్ము గురుభావన నారాధించుచుండమికి మది కంపించు
చున్నదన నయ్యువతి "వలదు వలదు. మనకూర్మి లింతటన
పోయెనే? మీఁదటఁగూడ నీపతియు నీవును నీకోరినట్లు మమ్ము
గురుభావంబున నడుపుకొనెద' రనఁ గలభాషిణి సంతసించి 'ఓ
పుణ్యాంపుటిల్లాలా! మీఁదజన్మంబున నైన నాకుఁ బాతివ్రత్యము
సిరముగాఁగల్గ దీవింపు" మని యట్లు సుముఖాసక్తిచే దీవనంది
ఖడ్గమిచ్చెదరే? యని మణిస్తంభువలన వాలుఁ గైకొని నియమ
గంధమాల్యవతియై పెండ్లికిఁ బోవునట్లు దేవి యెట్టయెదుట
కరిగి పద్మాసనస్థయై కూర్చుండి మణికంధరునకు ధైర్యము
చెప్పి వాలునిచ్చి తొందరపెట్టె. అతండు నట్లు కేలఁ బనిచేసె.

అపుడు మృగేంద్రవాహన యతనితో "మణికంధరా!
నీవు దయాకులత్వంబున బలినొసంగ నాలసించితివిగాన జన్మాం
తరమాత్రాన్యసాధనంబున

మృగేంద్రవాహనానుగ్రహము

సద్యోయావనుండ వగుచు
మహారాజ్యవైభవముల ననుభవించెదవు. కలభాషిణియుఁ
బ్రాణభయంబు లేశంబును లేక నాయందు భక్తిగలిగి నన్ను
మెప్పించెంగాన నిది యిప్పుడ పునస్సహితమస్తకయు నిజపురీ
వర్తినియునై తన బంధుమిత్రాదుల నలరించునని యానతిచ్చె.

కలభాషిణి యావలఁ బ్రదికి కనులువిచ్చిచూడ నది ద్వార
కలో స్వగృహారామభూమిగా యుండె. అటుమీఁద గలభా
షిణి తన సఖులతో స్వవృత్తాంతముం జెప్పి యద్భుతానంద
ములు గొల్పె.

ఇచట మణికంధరాదులు కలభాషిణీ శరీరఖండంబు లదృశ్యములగుటకు వెఱఁగంది యయ్యాదిమశక్తిం బెక్కుతెఱంగులం బొగడిరి.

అంత మణికంధరుండు మృగేంద్రవాహనకు దండప్రణామంబు గావించి సుముఖాసక్తి మణిస్తంభులఁ దగువిధంబుల వీడ్కొని శాపానుభవకాలంబుఁ బ్రతీక్షించుచు శ్రీకృష్ణసక్తంబైన తన మణిహారముఁ గుత్తుకనంటుకొనియున్న దానిందీసి యయ్యాలయంబుననే యచిరకాలమున వచ్చి జపపరుండై యున్న యలఘువ్రతుండను బ్రాహ్మణునకుఁ గృష్ణార్పణబుద్ధిని సమర్పించి విపంచింగూడ నాగుడిలో గుప్తంబుసేసి భృగుపాతలంపటమతియై శ్రీశైలమున కరిగె.

మణిస్తంభుండును భార్య వలసిన సపర్య సలుపుచుండ నా దేవీసన్నిధినే యోగాభ్యాసము చేయుచుండె.

ఇట్లు కొంతకాలము గడపి మరల నాసిద్ధుండు దేశాంతర వస్తువిశేషములం జూడ వాంఛకలిగి తన యంగనతో సింహవాహనం బెక్కి గగనంబునం జనియె.

## 21 మజిలీ

అలఘువ్రతుండు భువనేశ్వరీ మంత్రజపంబు రెండు సంవత్సరములు పరిపూర్ణంబుగాఁ జేయునంతట మృగేంద్రవాహన

నేను మొదట సరస్వతీదేవి ముంజేతి చిలుకను. ఒక కారణమున ద్వారకలోఁ గలభాషిణినై జనించితిని. అని యాకలభాషిణి సర్వవృత్తాంతముం జెప్ప. అదివిని యందఱు అచ్చెరు వొందిరి.

మధురలాలస కళాపూర్ణు వృత్తాంతము చెప్పుట

అప్పుడు సభలోని ప్రముఖులు కొందఱు సద్యోయౌవనుఁడైన మనమహారాజు సాధారణ మనుష్యునివలె దోఁచుచున్నాఁడు. వారివిషయము మఱింత బాగుగానుండునని యలఘువ్రతుని చెవిలో జెప్పిరి. అప్పుడలఘువ్రతుఁడు 'బాలారత్నమా! మన మహారాజునకు జనించుటతోడనే యౌవనమ్మును సిద్ధునివలన విల్లునమ్ములను లభించుటెల? యదిచెప్పి మన సమ్మధురలాలసయను శిశువిల్లనె.

అయ్యా! భూసురాగ్రణీ! నీవు మృగేంద్రవాహనాలయమ్మున నున్నపుడు సుముఖాసత్తి మణిస్తంభులఁ జూచితివిగదా. యనుడు జన్నిగట్టయ్యా! చూడ కేమి? ఆ పుణ్యదంపతులు కొన్నిదినంబులందే యోగాభ్యాసమానసుండై యవల నటకో చనిరి! అన శిశువవ్వలీకత వినుమని యిట్లనె. వారిట్లు తమ సింహవాహనమెక్కి యందందువిహరించి యవల నొక పురోపకంఠవనమున విశ్రమించిరి. అచటసిద్ధుండు తన యంగనరూపము తనకు మనోవికారము గల్గింప నామెతోఁ గ్రీడించుచు; రమణీ! నీవుపురుషునివలెను నేను స్త్రీవలెను వర్తింతమన్న నప్పుణ్యసాధ్వి నవ్వుచు మీకన్నిటను నిట్టి విపరీతవాంఛలే. మీరేముందు స్త్రీత్వము నొందుడు. పిదప నేను బురుషత్వముఁ దాల్తుననుచుండఁగనే వారు మారిరి. మణిస్తంభుఁడు కోమలశరీరము, కృశోదరము,

కబరీభరము, కలికికనుంగవ, కమనీయవదనము, మున్నగునని యొప్పార సుందరీమణియయ్యె. సుముఖాసక్తియు నానాగుణములు, చలచపల్లజడలు, నెగుబుజములు మున్నగునవియొప్పా ర బురుషుడయ్యె. ఇట్టి పురుషాకారవ్యత్యయమును గ్వారు నిదియేమి మాయయోయని కొంతతడవు సమాధిగాద్భుతరస మగ్నులైయుండిరి. అపుడు సముఖాసక్తి భర్తనుంజూచి 'నాథా! ఇదినా మాటవలననే జరిగినది. దీనికిం గార్యకారణమిప్పు డవగత మైనది. అలనాడు గుడిలోంగలభామినీ కడకునవచ్చి నాయొక్క చాయునపుడు 'నన్ను సత్యవచనంగాపింపుడిు' యనుచుండ మీ కత్తినా మెడను ఖండించినది. అందువలన నేను సత్యవచన నైతిం గావలయు. దేవిగుడిలోని స్తంభలిపిని స్మరింపుచున నతండు తన్వీ! ఇంక నేమియు గర్తవ్యము. ఏది యన్న నేమగునో? భద్రముగా సంచరింపవలయు. ఇకీ మిందురూపము ప్రియంకరము. మనమిట్లుయుండగా యభిమత భోగముల ననుభవించుచు నుండ మణిస్తంభునకు గర్భంబయ్యె. అంతట వారప్పురాధిపతి సత్యదాత్ము వేడికోలునంగీకరించి వారి సౌధమునకరగియుండ స్త్రీత్వము వహించిన మణిస్తంభునకు శిశువుదయించె. తోడనే యాశిశువునకు యౌవనమావిర్భ వించె. అంతలోనే స్వభావ సిద్ధుం పురుషుండై ధనుర్బాణంబులో సంగి కళాపూర్ణనామమిడి చనెను. అప్పుడు మణిస్తంభుండు సతింజూచి సరస్వతీదేవి మనకిచ్చిన వరము లెట్లు విధి తముగా ఫలించినవో చూచితివా! యనిరి. అని శిశువు పల్కుచో నలఘుపతుం డావరవృత్తాంతము సెప్పుమన నాశిశువు సుగాత్రీ

శాలీనుల కథంజెప్పి వారు పుత్రజననానంతరము సుముఖాసక్తి మాటచొప్పునఁ దమ తమ లోంటిరూపుల నొందిరి. సత్స్వదాత్మ్యండీ వీరి ప్రభావమును కడలి కళాపూర్ణునకుఁ తనరాజ్యం బొసంగుట మీరెఱింగినదే కదా. ఓయి లఘుప్రవతా! ఈ కళాపూర్ణ మహారాజు పూర్వజన్మమున నెవ్వరో తెలియునా? శక్తి మందిరమున నీకీ మణిహార మిచ్చిన మణికంధరుండే. అతండు నీకీ హారమిచ్చి పవిత్రమైన శ్రీశైలమున కేగి భృగుపాతమున కురికించుచుండ నొక సిద్ధుండు గానంబడి యేటికీ ప్రయత్నమున నపుడు మణికంధరుండు తనవృత్తాంతమంతయుం జెప్పె. అందు వినంబడిన నిజపుత్రీజామాతల వార్తలచే మఱియు నుత్కంఠ కలిగి వాని నడిగి యెల్ల విషయముల నెఱింగి పిదప సిద్ధుండిట్లనె.

స్వభావసిద్ధుఁడు సుగాత్రి జనకుఁడే

మణికంధరా! నేను సుగాత్రి జనకుఁడ. ఆ బాలికా జననానంతరము నేను వెడలి శ్రీదత్తాత్రేయుల వారిందపశ్చర్యచేఁ బ్రసన్నుం జేసికొని వారివలన సర్వయోగవిద్యా రహస్యముల గ్రహించి పిమ్మట నిర్జనస్థలంబని శతతాళ దఘ్న హ్రదంబున నాత్మావలోకన మొనర్చుచు నుంటిని. అందువలన స్వభావనామ మేర్పడె. నాయల్లుండు శాలీనుండు హ్రదంబునం బడి నాచెంతకురా వానికి వయస్స్తంభనమాద్యాదులొసంగి పంపితిని. అని చెప్పి సరస్వతీదేవి పుత్రికాజామాతల కొసంగిన వరము లెట్లుం గాకమానవు. కాన నీవు నాయల్లునకుఁ బుత్రుండవై పుట్టుము. నీకు నారదసేవ శ్రీకృష్ణభక్తి తీర్థయాత్రా

మీాయఁగై కొనిభయపడకు మెవ్వతెవునీవు. నాఁడెవ్వఁడనుచుండ నేదుముండ్లు రివ్వురివ్వునవచ్చి పైఁబడసాగె. అపుడాయంగన అయ్యా! సంభాషణమునకిది యదనుగాదు. వాఁడుసమీపించె. పందిరూపము నేదుముండ్లఁజిమ్ముకొనుచు నాదైత్యుఁడదె చూడు వచ్చుచున్నాఁడు. రయంబున వానింజంపుమన నా శూరాగ్రేసరుండు వెఱవకు నీకభయమిచ్చితి. వానిం జంపెద నని వానికెదురునడచి యసుర తనపై నేయు నేదుముండ్ల వానను గత్తితో వారించుకొనుచు ఘోరముగాఁబోరుచు మిక్కిలి సమీపమున కరిగి గుఱిచూచి రయంబున కత్తివిసరి వానిమెడఁద్రుంచె. ఆలో శల్యాసురుఁడు నఱపిన శరజాలము మణికంధరుండాకి గతాసుఁ జేసె. ఇట్లు మణికంధరుండు పరోపకారమునకు శరీరము నర్పించె నన నలఘుస్తతుండా కాంతయెవరు? ఆరాజసుండెవఁడు చెప్పుమన మధురలాలస యిట్లనియె.

దుర్గాదేవి మహిషాసురుం జంపెనని యతని మేనమామ కొడుకగు శల్యాసురుండు విని కినిసి దుర్గను సాధింపఁజూచు చుండెను. కాని దైత్యాంతకు చక్రమెచటనుండి వచ్చిపడునోయని జంకుచు

అభినవ కౌముదీవార్త

సందుదొరకు వఱకుఁ దనయభిప్రాయము బయల్పఱుపనీరాదని కపటాత్ముండై యొకవనమునఁ జరించుచుండె. అచటికి దైవవశమునఁ గొంత దివలనఁ బుట్టిన యప్సరోజాతి కన్య యభినవ కౌముదియనునది వచ్చెను. ఆమె నీశల్యుండు చూచి 'నన్నేలు కొమ్మ'ని వేఁడ నదివాని సకుఁగొనక యరుగుచుండె. అందు కతఁడు కనలి " నాతీ! యిట్లువేఁడ నన్నాదరింపక పోవు నిన్నె

పురుషుఁడేలునే ? నాప్రియుని జేర నెవని కెన్ని గుండెలే ? యని నది "రౌరీ ! నిన్ను మడియించు వానిఁగాని నేను వరింప. నిది నిజం" బనిపలుక వానికి రోషావేశ ముదయించెంగాని వానికాళ బాధించుటచే నాపె నేమియుఁ జేయకపోయెను.

కల్మాసురుండంతఁ దన్నుఁ జంపువానిం జంపుటకై యుపాయమన్వేషించుచు దైవికముగా మృగేంద్రవాహనాలయమున కరిగి "యీ గండకత్తెరచే మీఁదల యిచ్చు సాహసికుఁడు మరలఁ దనశిరంబదికికొనం బ్రదికి తన్నుఁ జంపఁగడఁగిన వానిం జంపు" నని శిలాస్తంభమున నుండఁ జదివి సంతసించి వెంటనే తదు కరీతింజరిపి యాం బలంబున నుప్పొంగుచుండెను. ఇంతలో నభినవకౌముదియు వీనిం జంపువానికై భూమండలమంతయు నరయుచు నామృగేంద్రవాహనా ప్రధానము విని యటకు వచ్చి వానింగడ కంటంగని తప్పించుకొనిపోవుచుండ వాఁడిట్లనె " అతివా ! ఇంకేమి చేసెదవు. నన్నుఁ జంపఁదిపురుగు వానిం జంపు శక్తి నీ దేవి వలనఁబొందితి. ఇప్పుడైన నాకోర్కె దీర్పుమన నది భయపడి గర్భాలయమునకుఁ బర్వెత్తి దేవిపాద ములపైఁబడి ప్రార్థించె. వాఁడును నామెరాకకై ప్రతీక్షించుచు బయటన నిలిచె.

అచట దేవి ప్రసన్నయై యభినవకౌముదితో నిట్లనె. ఈదుష్టుఁడు తనమీఁదల నిచ్చి తన్నుఁ జంపఁ జూచు వానిం జంపు శక్తినిబడసె. కాన నది తప్పదు. కాని యిందొక రహస్యము కలదు. తానెదిరిఁ జంపుటయే కాని తాను జావ కుండ నియమంబు లేదు. మఱి నీవో వీనిఁగెడయించువాని వరింతు

నంటివి కాని యాజన్మమందేయని పలుకలేదు. కాన నీరెంటికి సరిపడ నొకటి చెప్పెద విను.

ఇదిగో ఖడ్గము. ఇదియమోఘమైనది. దీనిని దత్తాత్రేయుండు సృజించి స్వభావసిద్ధున కొసంగె. అతండు మణిస్తంభునకు నతండు మణికంధరునకు నొసంగె. కనుక నీదివ్యాయుధంబా గంధర్వకుమారునకు సంప్రదాయాగతంబగుచుం గార్యకారి యగు. ఇతరులకుం బనుపునేయదు. కనుక నివు డిద్దానింగైకొని చని శ్రీశైలమందు భృగుపాతమున కాయత్తపడుచున్న మణి కంధరునకిమ్ము. వాఁడు నీపని నెఱవేర్చును. సిదపం గళావూ ర్ణుండై యతండు పుట్టుంగాన నతని నీవు వరించి నీ ప్రతిజ్ఞ చెల్లించికొమ్ము. త్రోవలో దైత్యుఁడు నిన్నేమియుం జేయ లేఁడని యానతిచ్చి పంప నామె ఖడ్గహస్తయై చనుచు వెంటఁ బడి వచ్చునా కాముకు మాటల పందిరివెట్టి మోసగించి శ్రీశైలమునకుం దోడ్కొని చని మణికంధరుచేఁ జంపించె.

పిమ్మట మణికంధరుండిమ్మహారాజై జనింప నాయచ్చర మిన్న యుచితగతిం జేరి తన పూర్వవృత్తాంతము వివరించి దివంబునకుఁ జనక యావజ్జీవంబు నవ్విభుండు నిలిచినచోటన యునికికినొడంబడి గాంధర్వ వివాహ విధిని వరించె. అని మధురలాలసనుడివె.

## 23. మజిలీ

అప్పుడలఘువ్రతుం డిట్లనె. మృగేంద్రవాహనాప్రభావం బసదృశమైనది. ఆమెకు నాపైమాత్రమే యేలొకో దయ రాలే

అలఘువ్రతునిచరితము

దన శిశువునవ్వి యిట్లనె. ఏలదయరా లేదు? రాఁబట్టియే నీకళత్రపుత్రులతో నిన్నుఁ గూర్ప నిచటఁబడవైచినది. అని ప్రథమాగమాదులతో "నేమండీ! మీతండ్రిగారికి నమస్కరింపుఁ డనుచుండ నలఘు వ్రతుండు భార్యల జలధిపాలు సేసిన యీ నిర్భాగ్యునకుఁ బుత్రులా? యన మధురలాలస ఇట్లనె.

అట్లైన నీకతవిను. చెప్పెద. అయ్యా! నీపేరు యజ్ఞశర్మ గదా! నీతండ్రిపేరు సోమశర్మగదా. నీజనకుఁడు నిరతాన్న దాత. వేదపారగుఁడు. గృహమేధియన్న నతనినే చెప్పవలయు. అతండు నీకు వేదాదివిద్యలు నేర్ప నెన్నిపాట్లు పడిన నీకందొ కటియు నంటదయ్యె. అంటనున్నమానె. అన్నదానముమాత్ర మేమఱక యెన్నిసంకటములం వచ్చిన సల్పుచుండ నట్టియున నీకుఁ జతురాగమ సంతానముదయించుఁ దప్పదని పల్కి నీకు నల్వురు కన్నియలం బెండ్లిసేసె. తండ్రియనంతర మీవా వ్రతమునలుపుటనే నీకలఘువ్రతనామ మేర్పడెను. ఏమయ్యా! నాచెప్పినది యథార్థమే? యన నలఘువ్రతుం "డమ్మా! సందియము లేదు. నీనోట బాగుగవచ్చునే! యన శిశువిట్లనె. నీవావ్రతమునకై సర్వస్వము వెచ్చపెట్టితివి. తుదకు నీనల్వురు భార్యల మెడలలోని మంగళసూత్రములు తప్పఁ దక్కిన సర్వా భరణముల వ్యయమొనర్చితివి. నీభార్యలును నీ వ్రతమునకు దోడ్పడిరి. ఆవల నన్నదానమునకుఁ జేరఁ జిల్లిగవ్వయు లేక వారు గర్భిణులనియు నెఱుఁగక యొకయోడబేహారికి నీనల్వురు భార్యల నమ్మి యాయంగనలతో నేనన్నదాన ధనమునకై

మోడ బేరము పోయెదనని దొంగమాటలు చెప్పి వారలచే
మేమును వత్తుము కొనిపోండు మిమ్ము విడిచి యుండలేమని
యనిపించుకొని వారల నోడ నెక్కించి నీవోడలో స్థలమున
కన్వేషించుచున్న ట్లొడ్డుననే నిల్చితివి.

ఇట్టి యేర్పాటు నీవది నటికే బేహారితోఁ జేసికొనియుంటచే
వాఁడు లంగరెత్తించి యోడను బోనిచ్చుచుండెను. అపుడు
నీవు ప్రేమాతిశయమున నాలిఁ దలఁచుకొని యావురని వావిచ్చి
బిట్టేడ్చితివి. ఆ యేడ్పులువు వినినీ భార్యలును నీ వ్యాపారి
మనల వంచించుకొని పోయెనునో యని వగచి సంద్రమునం
దుమికిరి. వెంటనే వర్తకుండు వలలు మున్నగువానితో వెద
కించి నీ భార్యలు వనధిం గనంబడమి నీ యేడ్పువలనన యింత
వచ్చినదని కలహించి తాను నీ కిచ్చిన ధనం బంతయు
మరలఁ గైకొని నిన్ను బోనిడిచె. నీవును భార్యా వృధా
విరహము లజ్జితుండవై యింటి కేగి నలువురి మొగముఁ జూడ
నోడి దేశాంతరములం బట్టి యెట్లో ధనము గడించుచు
దానితోడనే యథాశక్తి నన్నంబు దానంబు సేయుచు నా
వ్రతము జరుపలేనినాఁడు నిరుపాస ముండుచు దినంబులు
పుచ్చుచు నొకప్పుడు మృగేంద్రవాహనా ప్రభావము విని
యట కరిగి భువనేశ్వరీ మంత్రము రెండేండ్లు జపించి సకలా
భీష్టముల నంద నిటకు వచ్చితివి. ఇఁక నీ పత్నుల విషయము
వినుము. వారట్లు వారాశిం బడ బలుమీను నొకండు సలిలంబు
బీల్చుచో నా జలంబుతోఁ గూడ నా నల్వురు చెలువలు
లోని కరిగిరి. ఆవలన నది మూర్ధరంధ్రమునుండి నీటి

నగయుఁ జిమ్ముచో నా నీటి ధారతోఁ గూడ నా నల్వురు చెలువలు నింగి కేగి యొక విమానంబునం బడిరి. ఆ విమాన మందలి దివ్య మిథున మా తోయజాక్షుల నాదరించి కట్టంబుట్టం బులిచ్చి గోదావరీ తీరమందలి ధర్మపురిలోని వారాంగనాప్రో న్నత సౌధోపరిభాగమున వారిం దించి యుండదలి వస్తువులతో జీవింపుఁడు. మూఢత నిం దొరు లెన్నో మొట్టినం బ్రదుకువారు కారని పలికి చనియె.

అమ్మాటల నాదివ్యపురుషుల పసిమ్మిడ బోగముసానివిని భయంపడి వీరెవరో దివ్యాంగనలు. వీరిరాకవలన మనకు మేలుకలుగకపోదు. కాన నిచటి వస్తువుల మనసూసింపరాదు. అని తలంకి తొలంగి చనియె. అది యెల్లన నాగెల్లంబొక్క. అక్కటతన నాచెంత కేరుంబోక మిూఁదుమిక్కిలి యానల్వర వేల్పులఁగా భావించి మ్రొక్కుకొనుచుఁ గానుకలిచ్చుచుఁ గొలువసాగిరి. నీభార్యలును దానికెంతయుఁ జోద్యపడి దీన జనులపాల దేవుఁడుండుననుకొని వెలుపలికేగక యొకకంటం బడక యాసౌధంబునన గుప్తముగా నెల్ల పనులుదీర్చుకొనుచుఁ గాలక్షేపము సేయుచుండిరి. కాలక్రమమున నల్వురకు నల్వురు కొమరులుపుట్టిరి. అప్పుడొక సంయమి యాదృచ్ఛికముగా నటకువచ్చి జాతకర్మ నామకరణాదులును యథాకాలమున నుపనయనంబులును నాబాలురకుజరిపెను. ఆబాలురు స్వయం ప్రకాశిత సకలవిద్యులయ్యు శాస్త్రసిద్ధికొఱకు నామౌనికడన యత్యల్పకాలంబునఁ గృతాధ్యయనులైరి. అనఁ మాతలతో నాబాల పండితులెంతకాలమిట్లు రహస్యవర్తనములం జరిం

చుట. మాతండ్రిని వెదకి తెచ్చెదము. మీ రెప్పటి యట్ల దైవతవనితలవలె నిందు గట్టుదప్పక మెలంగుడని పెర లెఱుంగకుండ నిలువెడలి యప్పటి నృపాలుండైన మా తండ్రి మదాశయుం డమ విద్యావైశద్యంబున సంతృప్తుం జేసి వారి యాస్థానమునం బండితులై యుండి తండ్రిని వెదకించుచు నా మీఁదట మా తండ్రితోఁ బాటు వారును నీసభలో నుండిరని పలికె.

అపుడు ప్రథమాగమ ద్వితీయాగమ తృతీయాగమ చతు ర్ధాగమనామక పుత్రచతుష్టయ ముప్పొంగుచువచ్చి యలఘు వ్రతుపదముల వ్రాలిరి. తండ్రియు వారి నాశీర్వదించి యాద రించి యానందించె. అపుడు కళాపూర్ణుం డలఘువ్రతునితో నయ్యా! నీవ్రతము మానవలదు. వలసినంత ధనముమా బొక్క సమునుండి గ్రహింపుఁడు. భార్యా పుత్రులతో సుఖముండుఁ డని పల్కి మధురలాలసు వంకం దిరిగి "పిల్లా! నీ వింతకు మున్నెన్నఁడు నీసర్వజ్ఞత్వమును బ్రకటింపలే దేల? చెప్పు మన మధురలాలసయిట్లనె.

## 24 మజిలీ

ఇంతకు మున్ను జ్ఞానము నాకు లేదు. నేఁ డలఘువ్రతుం డిచ్చిన యీ హారమందలి పతకము నా హృదయము స్పృశిం చుటతోడనే నా కిట్టి జ్ఞానము కలిగి నది. వినుఁ డా గాథ.

**మణిహార వృత్తాంతము.**

సత్యాదాత్ముం డను నీ మంత్రిశేఖరుండు తొల్లి సుగ్రహనాముండు. ఆయన నా మేనమామ. ఆతఁడు హరింగూర్చి తప మొనర్చి సర్వజ్ఞత్వ మపేక్షించె. అవుడు శ్రీహరి యీ హార మిచ్చి యిందలి పతకము హృదయమునకుఁ దగుల సర్వము గోచరించు. కాని బ్రాహ్మణావమాన మొనర్చిన వారి కడ మాత్ర మీ హార ముండదని యానతిచ్చి చనియె. ఆ సుగ్రహుండు హారము గొనివచ్చుచుఁ ద్రోవలో నున్న యొక దేవాలయమున కరిగి యందలి వింతలు చూచుచు నందొక శిలా శ్రీ విగ్రహంబును గడింబున స్పృశించుచున్న యొక పరివ్రాజకుం గని పరిహసించె. అందు కతండు కోపించి యిది తుదగా నీ మొదలి యెఱుక యెంత గల దంతయు వినిహాతంబయ్యెడు మని శపించె. ఆ మాట విని సుగ్రహుండు పాదములం బడి నేఁడు నా నిర్మంది యీ శాప వృత్తాంత మెప్పుడు బయల్పడునో యప్పుడు నీకు శాపావసాన మగునని పల్కి చనియె.

అంత సుగ్రహుం డా హారపు బొక్కణము నా దేవాలయంబుననే మఱచి తన కుల గోత్ర నామాదుల సమస్తము మఱచి బాలుని కైవడి మత్తునిగతి తిరుగుచుండె.

అపుడు కాసారపురంబరాజకంబై యుండ నందలి మంత్రి ప్రముఖులు యోచించి యుత్తమ గజేంద్రమున కొక పుష్ప హార మిచ్చి యిది యెవని మెడలో వైచు నతండ మనకు రాజని నియమించి పంప నది సుగ్రహుని మెడలో దండ వైచి తనపై నెక్కించుకొని రా నతని రాజుం జేసికొని యతనివలనఁ

దమును సత్త్వ మూదయించుటంజేసి యతని సత్యదాత్ముం డని సిలువఁ జొచ్చిరి. అవల నతండు మీ తలిదండ్రుల నాదరించి మీకు రాజ్యమిచ్చి మీ మంత్రి యయ్యె.

సుగ్రహ్యుండు గుడిలో నుంచిన హారమును మధురాపుర ధరణీశుకుండు పుచ్చుకొని చని శ్రీకృష్ణున కొసంగె. ఆ దేవుండు మణికంధరునకు నిచ్చె. మణికంధరున కా హారము గళసీమక యుంటికొని యుండెంగాని హృదయమునకుఁ దగుల దయ్యె. అందువలన నతనికి సర్వజ్ఞాత్వత లేదయ్యె. మణికంధరుం డా హారము నే పుత్రున కిచ్చె. అతండు మీకు, దేవరవారు నాకు నిచ్చితిరి" అని మధురలాలస చెప్పె.

ఈ కథ వెల్లడి యగుటతోడనే సత్యదాత్ముండు పూర్వస్మృతి కలిగి యక్కజంపడియె.

అట్టియెడఁ గళాపూర్ణుండు సత్యదాత్మునితో "నీదే యీ హారము రాజ్యమును. గాన యథేచ్ఛముగా నలసినవి గొని సుఖింపు" మని మహాశయుని రూపానుభూతిని మిక్కిలి గౌరవించి "ఇంతటి గరిమ మీ పిల్లకతలు. మీ భాగ్యవైభవమున కెందు నీడు లేదు. ఈ బాలిక నాకు భార్య యగుటయ్యెడు. సందియంబు లేదు. మీరు రాజబంధువులై స్వేచ్ఛగా మెలంగుఁడు. ఈ బాలికకు దృష్టిదోషము తగులునో? హారముఁ దీసి దాఁచి యుంచి బాలికం బెంచి పెద్దసేయుఁ"డని వారిం బంపివైచె.

మఱియుఁ గళాపూర్ణుండు తన తల్లిదండ్రులం బిలిపించికొని వారి నతిభక్తి సేవించుచు యుక్తవయస్సు వచ్చినంత మధుర

లాలసం బరిణయంబొంది సుఖముగా రాజ్యమేలుచుండెను. మధురలాలస పాణిగ్రహణానంతరము హారవల్ల్యంత మొలకింగి ప్రియుని ప్రథమానుగ్రహ విశేషంబు నేమఱవచ్చునే ? యని దానిం దెప్పించుకొని పతకము హృదయస్థలంబు నలంకృతంబుగా నిరుగడలం గొన్ని మణులు నిలిపి నూతన సూత్రంబునం గ్రుచ్చి ధరించి యప్పుడప్పుడు ప్రియుని మోహమ్మోవి దాని నుంచుచు నెల్లవిషయంబు తెలుపుచు మృగేంద్రవాహనాల యంబున మణికంధరుండు దాఁచిన విపంచిం దెప్పించి గాన వినోదంబు సలుపుచు మహానందంబునం బ్రియునితోఁ గూడి సుఖించుచుండె.



ది ఓరియంటల్ పవర్ ప్రెస్, తెనాలి — 1000/10-1-49